THE ANDHRA PATRIKA - MADRAS

6 పేజీలు వెల 1 అణా.

దక్షిణ కొరియా ప్రభుత్వ పక్షంలో ముసలం: ఉపాధ్యక్ష ప్రభృతులపై బహిష్కరణ

—6 వ పేజీ

# ఆంధ్రపత్రిక

పాకిస్థాన్‌లో అమెరికా స్థావరాలకు చైనా అధిక్షేపణ: జఫ్రుల్లాగారు నేకరాచీ సమాధానం

—2 వ పేజీ

Regd. No. M. 1118 సంపుటం 40. సంచిక 251 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO శనివారము 12-12-1953

# 60 లక్షల బస్తాల ధాన్యసేకరణకు ఆంధ్రప్రభుత్వ నిర్ణయం

## "ఆంధ్ర కార్యాలయాలకు హైదరాబాదులో ఇళ్లులేవు"

తమ కార్యాలయాలే అద్దెకొంపలలో వుంటున్నవని అసెంబ్లీలో ముఖ్యమంత్రి ప్రకటన

హైదరాబాదు, డిసెంబరు 10: ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయాలు పెట్టుకోనివ్వడానికి హైదరాబాదు ప్రభుత్వానికి సౌంతభవనాలేవీ లేవనీ, హైదరాబాదు కార్యాలయాలే కొన్ని చోటెడంత అద్దె చెల్లిస్తూ అద్దె భవనాలలో ఉంటున్నవనీ హైదరాబాదు ముఖ్యమంత్రి డాక్టరు బూర్గుల రామకృష్ణ రావుగారు ఇవాళ హైదరాబాదు శాసనసభ సమావేశంలో ప్రశ్నోత్తరాల సమయమందు ఉద్ఘాటించారు.

తమ కార్యాలయాలు కొన్నిటికి గృహవసతి చూపించ వలసిందిగా కోరుతూ ఆంధ్ర ప్రభుత్వంనుంచి యింకా యేమీ రాలేదనికూడ ఆయన తెలియజేశారు.

సంస్థాన శాసనసభ శీతకాల సమావేశం ఇవాళ ఇక్కడ ఆరంభమయింది. స్పీకరు కె. యస్. వైద్యాగారే అధ్యక్షత వహించారు.

ఈ సమావేశం ఈ నెలాఖరు దాకా కొనసాగ గలదనీ, 8 అధికార బిల్లులను పరిశీలింపనున్నదనీ, అందులో అన్నిటికన్నా ముఖ్యమైనవి కౌలుదారీ, వ్యవసాయభూముల (సవరణ) బిల్లు, వ్యవసాయ ఋణనివారణ బిల్లు లనీ అనుకుంటున్నారు.

వనపర్తి నియోజక వర్గంనుంచి యిటీవల జరిగిన ఉపఎన్నికలో సంస్థాన శాసన సభకు ఎన్నికైన ప్రజా సోషలిస్టు అభ్యర్థి యన్. రామిరెడ్డి గారు ఇవాళ ఉదయమే ప్రమాణ స్వీకారం చేశారు.

### బుగాండా వ్యవహారాలు

నెహ్రూకు మక్రమకు కబాకా భార్య విజ్ఞప్తి

కంపాలు, డిసెంబరు 10: బుగాండా వ్యవహారాలలో కల్పించుకొని వాటిని సరిచేయవలసిందని కోరుతూ కబాకా భార్య సబగెరేకా ఎలిజబెత్తు రాణికీ, భారత ప్రధాని నెహ్రూకు, సమితి అధ్యక్షురాలు శ్రీమతి విజయలక్ష్మి పండిట్‌కు, గోల్డుకోస్టు ప్రధాని క్వామె మక్రమకు విజ్ఞప్తి చేసింది.

### ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

ప్రజాసభలో ప్రశ్నలకు ప్లానింగ్ మంత్రి సమాధానాలు

న్యూఢిల్లీ, డిసెంబరు 10: ద్వితీయ పంచవర్ష ప్రణాళిక తయారు చేయడం గురించి ఇవ్వాళ ప్రజా సభలో ప్లానింగ్ మంత్రి గుల్జారీలాల్ నందా కొన్ని ప్రశ్నలకు జవాబు ఇచ్చారు. ఈసందర్భంలో ఇంతవరకూ తీసుకొన్న ముఖ్యచర్య నీటిపారుదల, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల విషయంలో ఒక సలహా సంఘాన్ని నియమించటమే నన్నారు. వేటికి ప్రాధాన్యమివ్వాలి, అంగబలం ఎంత కావలసివుంటుంది అనే దానిని గురించి కూడా ప్రాథమిక చర్చలు జరిగాయన్నారు. ఏయే సూత్రాలను ఆధారంగా కొత్త ప్రణాళిక ఏర్పరుస్తున్నారని అడిగా, ఆ విషయం ఇంకా ఆలోచించలేదనీ, మొదటి ప్రణాళిక విషయంలో పెట్టుకొన్న సూత్రాలే దీనికి వుంటాయనీ అవసరమైనప్పుడు కొత్త సూత్రాలు ఏర్పరచుకోవచ్చుననీ అన్నారు.

ప్లానింగ్ దిగువనుంచి జరిగేటందుకు వీలుగా ప్రస్తుత యంత్రాంగాన్ని పునర్వ్యవస్థీకరించే ఉద్దేశం వుందా అని అడగ్గా, ఆలోచనలో వున్నదన్నారు.



విజయవాడ ఆంధ్ర లయోలా కళాశాలకు శంకుస్థాపన చేసినట్లు ప్రకటించి, ఆంధ్రగవర్నరు శ్రీ త్రివేదీ, దాఖలాగా రిజిష్టరులో సంతకం చేస్తున్న దృశ్యం.

### పాకిస్తాన్ ప్రభృతి దేశాలతో ఇండియా వ్యాపారం

న్యూఢిల్లీ, డిసెంబరు 9: పాకిస్తాన్ ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, బర్మాలతో జరిపిన వ్యాపారపు లావాదేవీలలో ఇండియాకు 135 లక్షల రూ.ల లోటు కల్పించింది. అంటే ఈ దేశాలనుంచి దిగుమతుల ఎక్కువగావుండి, ఎగుమతులు తక్కువగా వున్నాయి.

ఈ నాల్గు దేశాలకు ఇండియా మొత్తం 68 లక్షల రూ సరుకు ఎగుమతి చేసింది. 208 లక్షల రూ సరుకు దిగుమతి చేసుకుంది.

### సమితి ఆహార వ్యవస్థ

రోమ్, డిసెంబరు 10: సమితి ఆహార వ్యవస్థ కార్యవర్గానికి ఈ సంవత్సరం కూడా ఇండియా ఎన్నుకోబడింది.

## గోవాకు వందలకొద్దీ పోర్చుగీస్ సేనలరాక

ఎక్కువమంది నీగ్రోలని జాతీయసభ ప్రకటన

బొంబాయి, డిసెంబరు 10: పోర్చుగీసువారి క్రింద ఆఫ్రికాలో వున్న మొజాంబిక్ అంగోలా మొదలైన ప్రాంతాలనుంచి కొన్నివందలకొద్దీ సైన్యాలను గోవాకు వారు చేరుస్తున్నట్లు గోవా జాతీయ మహాసభ వారు నేడొక ప్రకటన చేశారు

ఈ వచ్చిన సైన్యాలలో కొద్దిమంది పెద్ద ఉద్యోగులు మాత్రం పోర్చుగీసువాళ్లు తక్కిన సైన్యం అంతా నీగ్రో జనంతో నిండివుంది.

గోవాలో ఏదో అత్యవసర పరిస్థితి ఏర్పడిందని యీ సైన్యాన్ని పోర్చుగీసువారు యిచ్చట ఓడల్లో దింపుతున్నారు. ఈ ఓడల్లోనే పెద్ద పెద్ద తుపాకులు, విమాన విధ్వంసక శతఘ్నులు, ఇంకా ఎన్నో రకాల ఆయుధాలుగూడా గోవాలో దిగుమతి అవుతున్నాయి.

ఈ వ్యవహారం అంతా ఉత్తర అట్లాంటిక్ మండలం ఒప్పందాన్ని అనుసరించి జరుగుతున్నట్లు అభిజ్ఞులు పేర్కొంటున్నారు. దీన్ని బట్టి పోర్చుగీసు ప్రభుత్వం 4 లక్షల నీగ్రో సైన్యాన్ని సమాయత్తం చెయ్యాలి ఆయుధాలను వాటిని గోవాకు చేరవెయ్యాలి. ఇదంతా నాలుగేండ్లలో జరగాలి.

ఈ సైన్యానికి అయ్యే ఖర్చునంతా అమెరికా భరిస్తున్నది. ఈ సహాయాన్ని తీసుకుంటూ పోర్చుగీసు ఇంకా మరికొన్ని నీగ్రో సైన్యాలను గోవాకు చేరుస్తుందని, ఈ కొండకు అంతా అవుతున్న ఖర్చు అమెరికా యిస్తున్న సహాయాన్ని మించిపోయి పోర్చుగీసుకు అవస్థలను సృష్టిస్తున్నా, జరపవలసి వున్నదని తెలుస్తున్నది.

### మధ్యప్రదేశ్ ఎన్నికలు

నాగపూర్, డిసెంబరు 10: మధ్యప్రదేశ్‌లో జరిగిన జనపదాల ఎన్నికల్లో కాంగ్రెసు అప్పుడే మొత్తం 741 స్థానాల్లోను 417 స్థానాలు సంపాయించింది. ప్రజాసోషలిస్టులు 181 స్థానాలున్నూ, స్వతంత్రులు 120 స్థానాలున్నూ, ఇతర పార్టీలన్నీ కలిసి 69 స్థానాలున్నూ సంపాయించారు.

### ముసలి ఇంజనీర్లు: పందికొక్కులు

—(౦)—

రాజాజీ ఉపమాలంకారం

కోయంబత్తూరు, డిసెంబరు 10: మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారి నేడు ముసలివాళ్లయిన ఇంజనీర్లను పందికొక్కులతో పోల్చారు.

అయితే; ఈ రెండు రకాల జీవుల విధాలు, ధర్మాలు మాత్రం వేరువేరు అన్నారు. ఒకజీవిపని నిర్మాణాత్మకం అయితే, ఇంకోజీవి పని వినాశాత్మకం. అందువల్ల ఈ రెండు రకాలజీవులు చేసేది ఖనన కార్యమే అయినా, ప్రయోజనాలు మాత్రం వేరుగా వుంటున్నాయి అన్నారు.

## మద్రాస్, కేరళ రాష్ట్రాలకు మూడు లక్షల టన్నుల బియ్యం సప్లయి:

### ధర సిలకడకు రైతుకు హామీ

టెండర్లద్వారా మద్రాసు రాష్ట్ర ప్రైవేట్ వ్యాపారస్తులకు సరఫరా: వచ్చేలాభం అభివృద్ధి ప్రణాళికలకేనని ఎం. టి. రాజుగారి ప్రకటన

మద్రాసు, డిసెంబరు 11: "మొదటిరకం రెండు మణుగులబస్తా ఒకటింటికి రూ. 19-12-0చొ॥న, రెండవరకంబస్తా రూ. 18-12-0 చొ॥నన్నూ మొత్తం రెండురకాలు కలసి 60 లక్షలు బస్తాల దాకా ధాన్యాన్ని ఆంధ్ర ప్రభుత్వంవారు రాష్ట్రంలో స్వచ్ఛంద ధాన్యసేకరణ పద్ధతిని కొనదలచుకున్నారు. స్వచ్ఛందపద్ధతి అనగా ప్రభుత్వం పైన ఉదహరించిన ధరల ప్రకారం ఏజెంట్లద్వారా ధాన్యాన్ని సేకరిస్తుంది. ఈ ధర తనకు గిట్టుబాటు అయితే రైతు ప్రభుత్వానికి ఇతరులకుఅమ్ముతున్నట్లే అమ్మవచ్చు. రైతుఇంతకంటే ఎక్కువధర వస్తుందనుకుంటే, మాకే అమ్మమని ప్రభుత్వం బలవంతం చెయ్యదు. స్వచ్ఛందపద్ధతి ఉద్దేశ్యమేమనగా ధాన్యమునకు సరియైన ధర రైతుకు ముట్టేట్లు చూడటమున్నూ, అదనపు పంట మూలంగా ధాన్యం ధరలు హఠాత్తుగా పడిపోయి రైతును ఆర్థిక దుస్థితిలో త్రోయకుండా చూచేందుకున్నూ" అని ఆంధ్ర ప్రభుత్వ ఆహారశాఖా కార్యదర్శి శ్రీ ఎం. టి. రాజు ఐ. సి. ఎస్. గారు ఇవాళ ఆంధ్ర రెవెన్యూబోర్డులో ఆంధ్రపత్రిక ప్రతినిధితో మాట్లాడుతూ ప్రభుత్వ ధాన్యసేకరణ విధానాన్ని గూర్చి వివరించారు.

"ఆంధ్రరాష్ట్రంలో పైన నిర్ణయించిన ధరలు ప్రభుత్వం ధాన్యాన్ని కొనేధరగాని కంట్రోలుధరగాదు. ఆంధ్ర రాష్ట్రంలో జిల్లాల మధ్య ధాన్యంరవాణా నిషేధాలుగాని, ధరల కంట్రోలుగాని ప్రభుత్వం పెట్టదలచుకోలేదు." అని కూడా అన్నారు.

"ఈ ధాన్యపుధరలకు నిలకడను చేకూర్చేందుకు మాత్రమే ప్రభుత్వం సర్వ ఆర్థిక సూత్ర సమ్మతమైన ఒకధరను తాను నిర్ణయించుకొని ఆ ప్రకారం ఆ ధాన్యాన్ని మార్కెటులో కొంటుంది. ఈ వ్యాపారంలో ఏమన్నా మిగిలితే దాన్ని అభివృద్ధి ప్రణాళికల మీదనే ప్రభుత్వం వెచ్చింపదలచింది" అని గూడా శ్రీ ఎం. టి రాజు గారు తెలియ చేశారు.

"మూడు లక్షల టన్నులే గాక ఇంకా అధికంగా గూడా ప్రభుత్వం ధాన్యాన్ని నిర్ణీతధర ప్రకారం కొనవచ్చు. ఈ విధంగా సేకరించిన ధాన్యంలో ఒకలక్ష టన్నులు బియ్యాన్ని తిరుకొచ్చికి ఇస్తాము. మద్రాసుకు రెండులక్షల టన్నులు ఇస్తాము ఇందులో ఒకలక్ష మద్రాసు ప్రభుత్వానికిన్నీ మరోలక్ష టెండర్ల ద్వారా మదరాసు రాష్ట్ర వర్తకులకు సప్లయి చేస్తాము. తిరుకొచ్చివారు మణుక్కు అర్ధరూపాయి చొ॥న బోనసు ఇస్తారు. మద్రాసు వారు సమష్టి రాష్ట్రధరనే ఇస్తారు. వర్తకులకు అమ్మే ధాన్యం టెండర్లద్వారా వచ్చే ధరలలో అధికధరగా వుంటుంది" అనికూడా రాజుగారు వివరించారు

శ్రీ తిమ్మరాజుగారు ఆంధ్రరాష్ట్రంలో ప్రస్తుతం ఉంటే ఆహార పరిస్థితిని ఈ విధంగా తెలియ చేశారు: "మామూలుగా ఆంధ్రరాష్ట్రంలో 18 లక్షల టన్నుల బియ్యం తయారవుతాయి. మనకు మామూలుగా 16 లక్షల టన్నులు వాడకం ఉంది. అనగా లక్షా 67 వేల టన్నులు మిగులు కనిపిస్తోంది బాగా సేకరణజరిగినరోజుల్లో లక్షలు టన్నులవరకూగూడా బియ్యం సేకరణజరిగేది. అంతకు మించిగూడా సేకరణజరిగినరోజులు లేకపోలేదు. గత పాలన మద్రాసు రాష్ట్రంలోని తెలుగు జిల్లాలకు లెవీ సేకరణపద్ధతిని కంట్రోలుధరకు మనం లక్ష టన్నుల దాకా బియ్యాన్ని సరఫరాచేశాము. ప్రయివేటు వర్తకులు ధర కంట్రోలు లేకుండా లక్షటన్నులదాకా అమ్మారు. బజారు ధరలు కంట్రోలు ధరల కన్న 1½ రెట్లు దాకా గూడా వెళ్లాయి".

"ప్రభుత్వంవారు గత పాలన సేకరణధరకు మొదటిరకం ధాన్యం రెండు మణుగుల బస్తాను రూ 19-12-0 న్నూ రెండవరకం రూ 18-12-0 న్నూ ఇచ్చారు. ఈ ధరలు ఇలా ఉండగా బస్తా ఒకటికి ముప్ఫయిదాకాగూడా బయట బజారులో రైతుకు ధర పలికింది. అక్టోబరులో మనరాష్ట్రం అవతరించే సమయానికి బజారులోకి రసంగి, బసంగి కొత్తపంటవచ్చింది. ఈ కొత్తపంట ధర రూ. 17లు రూ 16లు గూడాదుండి. కోతలు పూర్తి అయి పంట బజారులోకివిడుదల అవుతున్న కొద్దీ ఈధరలు తగ్గే సూచనలు కనిపిస్తున్నాయి. మదరాసు రాష్ట్రంవారు ఈ ఆహార మండలాలు పోతాయనే భయంతో ధాన్యం అదే పనిగా కొని బాగా నిల్వలు చేసుకొన్నారు. మనకు మద్రాసే ఎక్కువ వీలైన మార్కెటు, గనుక ఆ నిల్వలవల్ల, మనకు వచ్చే కొత్తపంట

(3 వ పేజీ చూడుడు)

## నెలాఖరులోగా కర్నూలులో భవనాలకు పునాదులు

నిర్ణీత కార్యక్రమం ప్రకారం నిర్మాణం పూర్తి చేయడానికి ప్రభుత్వ సంకల్పం

(ఆంధ్రపత్రిక విలేఖరి)

కర్నూలు, డిసెంబరు 11: ప్రభుత్వం నిన్న ఆమోదించిన భవన నిర్మాణపథకానికి ఈసంవత్సరం ఆఖరి భాగపు బడ్జెట్‌లో 25 లక్షల రూ మాత్రమే ప్రభుత్వం ప్రత్యేకించినా ఈ పథకమంతా అమలు జరపడానికి సుమారు 60 లక్షల రూ ఖరచు కావలసి రావచ్చు. ప్రస్తుతం 'ఏ' 'బి' తరగతుల డేరాలున్న స్థలాలలో ఉద్యోగుల నివాసానికి 500 ఇండ్లు ఇప్పుడు చీఫ్ సెక్రటరియేట్ కార్యాలయం వున్న భవనం ఆవరణలో చీఫ్ ఇంజనీర్ల కార్యాలయాల కొకటి, ఇతర సెక్రటరియేట్ కార్యాలయాలకు మరొకటి, మొత్తం 2 బ్లాకులూ, అసెంబ్లీ భవనానికి ఒక హాలూ నిర్మించే పథకాన్ని ప్రభుత్వం నిన్న ఆమోదించింది.

ప్రభుత్వం కట్టించనున్న 500 ఇండ్లలో పెద్ద ఉద్యోగస్థులకు ఉద్దేశింపబడిన డజను ఇండ్లు పోను మిగతా యిండ్లు నాన్‌గెజిటెడ్ ఉద్యోగస్థులకు ఉద్దేశించబడినవి.

నిర్ణీత కార్యక్రమ ప్రకారం ఈ భవనాల నిర్మాణం పూర్తికావాలంటే (డిసెంబరు) ఈ నెలాఖరుకు వాటి పునాదుల నిర్మాణం పూర్తి కావాలని హౌసింగ్ శాఖ చీఫ్ ఇంజనీరు శ్రీ జె. ఎమ్. ప్రెసిక్ నేడు 'ఆంధ్రపత్రిక' ప్రతినిధితో అన్నారు. ప్లానులూ డిజైనులలో ఏవో చిన్న చిన్న మార్పులు చేయబడవలసివున్నా అనుకొన్నట్లు వీటి నిర్మాణం పూర్తిచెయ్యగా యత్నాలు కృషి జరుగుతుందని కూడా ఆయన చెప్పారు.

## కెన్యాలో ఆఫ్రికన్ల వధపై విచారణకు బ్రిటన్ నిర్ణయం

— యుద్ధమంత్రి ప్రకటన

లండన్, డిసెంబరు 10: కెన్యాలో డబ్బు బహుమానం ఇచ్చి బ్రిటిష్ సైన్యాలు జనాన్ని చంపిస్తున్నారన్న ఆరోపణలను గురించి అధికారికమైన విచారణ జరిపించడానికి బ్రిటిష్ ప్రభుత్వం నిశ్చయించుకున్నట్లు యుద్ధమంత్రి ఆంథోనీ హెడ్ నేడు పార్లమెంటులో ప్రకటించారు.

తూర్పుఆఫ్రికాలో వున్న బ్రిటిష్ సేనాని జనరల్ ఎర్స్కిన్ ఈవిచారణ జరిపించ వలసిందిగా సిఫార్సు చేశారు ఈ సిఫార్సును బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించి సర్ కెన్నత్ ఓ'కానర్, బ్రిటిష్ సైన్యం న్యాయ సలహాదారులో కిన్యాను ఈ విచారణ జరిపేందుకు సంప్రదిస్తున్నారు. ఈ ఇద్దరూ గాక, ఈ విచారణ జరిపేందుకు స్థానికంగా ఇంకో వ్యక్తిని గూడా నియమిస్తారు.

### పఖ్తూనిస్తాన్ స్వాతంత్ర్య పోరాటం

అమెరికా నైతిక సహాయానికై నిక్సన్‌కు విజ్ఞప్తి

కాబూల్, డిసెంబరు 10: స్వతంత్ర, అక్రమిత పఖ్తూనిస్తాన్ల నాయకులు అమెరికా ఉపాధ్యక్షుడు నిక్సన్‌ను కలుసుకొని తమ స్వాతంత్ర్య పోరాటంలో అమెరికా నైతిక సహాయాన్ని కోరినట్లు 'ఇస్లా' అనే ఇక్కడి దైనిక పత్రిక ప్రకటించింది దీనికి నిక్సన్ ఏమాత్రం సమాధానం ఇచ్చిందీ లేనిదీ ఆ పత్రిక ప్రకటించ లేదు.

### కరేన్‌లమీద బర్మా సేనల దాడి

మౌల్మీన్, డిసెంబరు 10: మౌల్మీన్‌కి ఉత్తరంగా 20 మైళ్ల దూరంలో బర్మా ప్రభుత్వ భూసేనలు, విమానాలు చిన్న యుద్ధనౌకలు కరేన్ విద్రోహుల మీద దాడులు ప్రారంభించినవి. రబ్బరు, తగరం ఉత్పత్తిచేసే ఈ ప్రాంతంలో తిష్ఠ వేసుకున్న కరేన్‌లను తరిమి వేయటానికి బర్మా సేనలు తలపెట్టిన పంపిణీయా త్రికు ఇది ప్రారంభ మున్నమాట. మౌల్మీన్ నది మీదుగా బర్మా ప్రభుత్వ యుద్ధనౌకలు వచ్చి కరేన్‌లమీద దాడి చేసినవి.

## సూడాన్ పార్లమెంటు ఎగువసభ ఎన్నికలు

జాతీయవాదులకు విజయం

ఖార్టూమ్, డిసెంబరు 10: సూడాన్ సెనెట్ (ఎగువసభ) కు జరిగిన ఎన్నికల్లో ఇంతవరకు 20 స్థానాల ఫలితాలు ప్రకటించారు. అందులో 15 స్థానాలకు ఈజిప్టుతో కలియకను కోరే జాతీయవాదులు గెల్చారు. ఈ సెనెట్ మొత్తం బలం 30 స్థానాలు

ఈజిప్టుతో కలియకను కోరక స్వతంత్రతను వాంఛిస్తున్న ఉమ్మా పార్టీకి 2 స్థానాలమాత్రం లభ్యం అయినాయి. దక్షిణపక్షం అని వున్న ఇంకో పక్షానికి ఒక స్థానం వచ్చింది. ఇద్దరు స్వతంత్రులు గెలిచారు.

సూడాన్ పార్లమెంటు దిగువసభకు జరిగిన ఎన్నికల్లో గూడా ఈజిప్టుతో కలియకను కోరుతున్న జాతీయపక్షమే గెలిచింది.

న్యూఢిల్లీ, డిసెంబరు 10: ఢిల్లీలో జనవరి 6 వ తేదీనాడు గాంధీ జ్ఞాన మందిరాన్ని నెహ్రూ ప్రారంభం చేస్తారు.

## 'ఆంధ్రలో ఖనిజసంపదను సమగ్రంగా సర్వే చేయించాలి'

— ఢిల్లీకి అభ్యర్థన

కర్నూలు, డిసెంబరు 11 ఆంధ్రలో దొరికే ఖనిజసంపద విష్కృతంగా వినియోగపడ్డానికి వీలుగా ఆంధ్ర భూభాగమంతా సమగ్రంగా సర్వేచేయించవలసిందిగా రాష్ట్రప్రభుత్వం భారతప్రభుత్వాన్ని అభ్యర్థించింది.

కొన్ని ఆంధ్రజిల్లాలలో (ఇండియన్ జియలాజికల్ సర్వే) భారత భూగోళశాస్త్ర పరిశోధకులు ఇప్పటికే ఈ సర్వే కార్యక్రమం సాగిస్తున్నారు. ఈవిధంగా కొద్ది కొద్దిగా సర్వేచేయించడంకంటే ఏయే ఖనిజాలు ఏయే ప్రాంతాలలో ఎంతవరకు దొరికేదీ సమగ్రంగా సర్వేచేయిస్తే ఆంధ్ర పారిశ్రామికాభివృద్ధి ప్రణాళిక తయారుచేసుకొనడానికి వీలుగా వుంటుందని ఆంధ్రప్రభుత్వం భావిస్తున్నది. ఆంధ్రలో పుష్కలంగా దొరికే ఖనిజాలలో అభ్రకం, మాంగనీస్, జిప్సమ్ ఉన్నవని తెలుస్తున్నది.

ఆంధ్రప్రభుత్వం చేసిన సూచనకు భారతప్రభుత్వంవద్దనుంచి సమాధానం రావలసి వున్నదని నేడొక అధికారి అన్నారు. (పి. టి. ఐ.)

## ప్రాథమిక విద్యాబోధన

### కవిసార్వభౌముని సలహా

రాజమండ్రి, డిసెం 9: "ఆంధ్ర రాష్ట్ర హిందీ విద్యార్థి పరిషత్ కార్యదర్శి శ్రీ హితార్థిగారిచే నడుపబడుతున్న "శ్రీ కౌముద్యానంద విద్యాలయ" ప్రథమ వార్షికోత్సవం కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారి అధ్యక్షతన ఈ నెల 8వ తేదిన తోట్రేదులో అతివైభవంగా జరిగింది.

ఉదయం 7 గంటలనుంచి 9 గంటల వరకు మహాపురుషుల చిత్రపటాలతో విద్యాలయ విద్యార్థులు గ్రామవీథుల లో ఊరేగింపు జరిపారు. సాయంత్రం 4 గంటలకు ఆలిండియా రేడియో నాగస్వర విద్వాంసులు, సువర్ణహస్త ఘంటాకంకణ బిరుదాంకితులు అయిన శ్రీ పిప్పళ్ళ మీరాదాసుగారి పార్టీ వారిచే నాగస్వరకచేరీ జరుపబడింది. ఈ సందర్భంలో శ్రీ శాస్త్రిగారు శ్రీ పిప్పళ్ళ మీరాదాసుగారి నాగస్వర వాయిద్యాన్ని ప్రశంసిస్తూ మాట్లాడారు.

తరువాత "యోగాసన ప్రవీణ" డాక్టర్ శ్రీ కొడాలి అచ్యుతరావు గారిచే యోగ, వ్యాయామ కళా ప్రదర్శనలు జరిగినవి.

విద్యాలయ వ్యవస్థాపకులు శ్రీ హితార్థిగారు సభాధ్యక్షు, ప్రారంభకులను సభికులకు పరిచయంచేస్తూ వారి రాకవలన ఈనాడు తమ విద్యాలయం ధన్యమయిందన్నారు. సభ జయప్రదంగా జరగాలని కోరుతూ ఆంధ్రరాష్ట్ర స్థానికస్వపరిపాలన శాఖామాత్యులు శ్రీ పి. తిమ్మారెడ్డిగారు, విద్యావనం సంస్థాపకులు శ్రీ యలమంచిలి వెంకటేశ్వరరావుగారు పంపిన సందేశాలను ఆయన చదివారు.

తరువాత కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ, ఆంధ్ర అస్థాన కవులుఅయిన శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. సుప్రసిద్ధసాంఘిక సేవకులు శ్రీ గౌతమీ జీవకారుణ్య సంఘస్థాపకులు అయిన శ్రీ కారుణ్యానందస్వాముల వారు సభను ప్రారంభిస్తూ ప్రతి మానవుడు విద్య నేర్చుకోవలసిన అవసరం వివరించారు.

తరువాత ఆచార్య శ్రీ దామెర్ల వెంకట్రావుగారు ప్రసంగిస్తూ ఇలా అన్నారు:

శ్రీ కృష్ణదేవరాయలు ఏలిన ఆనాటి దక్షిణాపథంలో అష్టదిగ్గజాలనే అస్థాన కవు లుండేవారు. ఈనాటి ప్రజాస్వామ్యం దక్షిణాపథంలో ఆ అష్ట దిగ్గజాలకు సమానుడైన కవిసార్వభౌము డున్నాడు. అట్టి కవిసార్వభౌముని రప్పించుకొన్న ఈ తోట్రేదుగ్రామానికి ఈ రోజు ఒక మహాపర్వదినం."

"ఈనాడు మనం ప్రజాస్వామ్య ప్రభుత్వంలో వున్నాం. పండిట్ నెహ్రూజీ సారథ్యం క్రింద మన భారత ప్రభుత్వం స్వాతంత్ర్యాన్ని సంపాదించిన ఈ కొద్ది సంవత్సరాల లో ఎన్నో ఘనకార్యాలను సాధించింది. విద్యావిధానంలో ఎన్నో మార్పులను తెచ్చింది. మనరాష్ట్రప్రభుత్వం అస్థానకవులను నియమించి వారిని పోషిస్తుంది. అట్టి అస్థానకవులలోని వారే మన శ్రీ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారు."

తరువాత ఆంధ్రయువతీ సంస్కృతి కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు ఉపన్యసిస్తూ స్త్రీలకు అందుబాటులో వుండే విధంగా విద్యావిధానంలో సంస్కరణలు జరగాలని, మాతృభాషకు ఆంగ్లభాష ను తెలిపాలకు - ఆ పుస్తకాల కుమన్న తేడా వున్నదని కాగా జాతీయ విద్యాలయాలలో చదువుతూ సంగీత, సాహిత్యాలతోపాటు కుట్టుపని మొదలైన చేతివృత్తులలోకూడా స్త్రీలుముందంజ వేయాలనీ అన్నారు.

పిమ్మట శ్రీ గౌతమీ జీవకారుణ్య సంఘ కార్యదర్శి శ్రీ కనకం అప్పల స్వామిగారు ప్రసంగిస్తూ "విద్యలేని వాడు వింతపశువు" అని ఆరోక్తి కలదని, కాగా విద్య వలన మానవుడు సర్వం సాధించగలడు కాబట్టి ప్రతి ఒక్కరు విద్యాధికులై సంఘసేవకు పూనుకోవాలన్నారు.

తరువాత శ్రీ పేరూరి సత్యమూర్తి గారు మాట్లాడుతూ భాషాన్ని వ్యక్త పరచుకొనేటంతవరకైనా ఆంగ్ల భాషను అభ్యసించాలని సూచించారు.

ఆ తరువాత తోట్రేదు ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు శ్రీ పెద్దింటి సత్యనారాయణగారు శ్రీ శాస్త్రిగారిని గురించి తామువ్రాసిన పద్యాలను చదివారు. విద్యాలయం దినదిన ప్రవర్థమానంగావాలని ఆశీర్వదిస్తూ శ్రీ రాణ కవిగారు, శ్రీ ధవళ సుందరనారాయణ శర్మగారు తామువ్రాసిన పద్యరత్నాలను సభలో మృదుమధురంగా గానం చేశారు.

తుదపరి కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు తమ అధ్యక్షోపన్యాసంలో ఇలా అన్నారు:

"నా స్వగ్రామం కొటవరం అక్క డింకల ఇదివరకు నాకు తోట్రేదుతో ఎంతో సంబంధంవుండేది. తెలుగు లో నా మొదటిపద్యం "తోట్రేదు గ్రామమందున" అని తోట్రేదును గురించి వ్రాసినదే. అందువలన ఈ గ్రామానికి రావడం నాకు ఎంతో సంతోషాన్ని కలిగించింది".

ఈ పాఠ్యాంశంలో ... ఒక విద్యార్థినిగా ... శ్రీ శాస్త్రిగారు ఇలా అన్నారు: "ఉత్తరదేశం (బెంగాలు) నేపాళం, ఎక్కడ, వారాలు, తెలు...

# నెల్లూరుజిల్లాలో వెంటనే మైనర్ ఇర్రిగేషన్ పనులు

### ప్రారంభించాలని జిల్లా కాంగ్రెస్ అభ్యర్థన

నెల్లూరు, డిశంబరు 7: నెల్లూరు జిల్లాలో ఏపెద్ద ప్రాజెక్టు క్రిందకు రాని ప్రదేశాలలో వెంటనే మైనరు ఇరిగేషన్ ప్రణాళికలను అమలుజరప వలసిందిగానూ, ఈ జిల్లాలోని ఉదయగిరి తాలూకా పరిస్థితి రాయలసీమకం టేకూడా అధ్వాన్నంగా వున్నది కనుక ఆ తాలూకా అభివృద్ధికి తగుచర్యలు తీసుకోవలసిందిగానూ ప్రభుత్వాన్ని అభ్యర్థించుతూ నిన్న ఇక్కడ జరిగిన సమావేశంలో నెల్లూరుజిల్లా కాంగ్రెసు కార్యవర్గంవారు తీర్మానించారు. సమావేశానికి బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షత వహించారు.

బిట్రగుంటనుంచి ప్రస్తుతం ఉదయం గూడూరు వరకూ నడుస్తున్న మిక్స్‌డ్ పాసింజరును ఈనెల 16వ తేదీ నుంచీ ఆపివెయ్యవద్దని, బిట్రగుంటలో రైలుస్టేషనునుంచి రైల్వే ఇండియన్ కాలనీకి పోవడానికి ఓవర్ బ్రిడ్జిమీద టాపు వేయించవలసినదిగాను, నెల్లూరు రైలుస్టేషను అభివృద్ధి చేయించవలసిందిగానూ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానాలు చేశారు.

## రాజమండ్రి మున్సిపల్ కౌన్సిలు

### ప్రాథమిక విద్య బడ్జెట్ ఆమోదం

రాజమండ్రి, డిశంబరు 9: ఈపట్టణ మున్సిపల్ కౌన్సిల్ సమావేశం డిశంబరు 7-వ తేదీన చైర్మన్ డా॥ ఎ. బి. నాగేశ్వరరావుగారి అధ్యక్షతన మొన్న జరిగినది. 1954-55 సం॥రపు ప్రాథమిక విద్య బడ్జెటును 53-54 ప్రాథమిక విద్య రివైజ్డు బడ్జెటును ఆమోదించారు.

మున్సిపల్ ప్రాథమిక పాఠశాలలకు భవనాలనిమిత్తం, 28 వేల రూ. లను బడ్జెటులో ప్రత్యేకించడం గమనార్హమైన విషయం.

## అనకాపల్లి కౌన్సిలర్ సభ్యత్వం రద్దు

అనకాపల్లి, డిశంబరు 9: ఇటీవల గంధి కోటేశ్వరమ్మగారు మూడు నెలలు వరసగా సమావేశాలకు రానందున పురపాలకసంఘంలో ఆమెగారిసభ్యత్వం రద్దయింది. ఈ విషయమై విశాఖపట్నం సబ్ జడ్జీ కోర్టులోకూడా విచారణ జరిగి సభ్యత్వం రద్దయినట్లు సబ్ జడ్జిగారు తీర్పుచెప్పారు. యిప్పుడు కౌన్సిల్‌లో స్త్రీసభ్యత్వం ఖాళీ అయింది.

## ఆంధ్ర ఇంజనీర్లసంఘం

(ఆంధ్రపత్రిక విలేఖరి)

కర్నూలు, డిసెంబరు 10: నిన్న ఆంధ్ర ఇంజనీర్ల సంఘం విశ్వనాథంగారి అధ్యక్షతన ఏర్పడింది.

ఇంజనీర్లలో ఇంజనీరింగ్ సమాచార ప్రచారానికీ, సేవా నిరతి నీ సహకార నిరతి అభివృద్ధి చేసేందుకు ఈ సంఘం ఏర్పడింది. టి. వాసుమంతిరావు ఉపాధ్యక్షులుగాను ఎమ్. వి. సూర్యప్రకాశంగారు కార్యదర్శిగా ఎన్నికైనారు. బాచలర్ ఆఫ్ ఇంజనీరింగ్ పట్టభద్రులు, అందుకు తుల్యమైనవారే సంఘ సభ్యులుగా ఉంటారు.

లు, తెలుగునెలలు, తెలుగు సంవత్సరాలు, ఋతువులు వాటిధర్మాలు మొదలైనవాటిని రోజూ సాయంత్రం పిల్లలచేత వల్లింపజేయడం మొదలైన విషయాలలో ఉపాధ్యాయులు పిల్లలను గురించి ఎక్కువశ్రద్ధతీసికోవాలి. ఈసూచనల ప్రకారం ప్రాథమిక విద్యలో పిల్లలను అభివృద్ధిలోనికి తీసికొని రావడానికి విద్యాలయ వ్యవస్థాపకులైన శ్రీ హితార్థిగారు కృషి చేయగలరు నిస్సందేహం నాకు బాగావున్నది. 22 ఏండ్ల వయస్సులో వున్న ఈయుక్తవాడు ఒక్కడే ఈ విద్యాలయాన్ని ఇంతటి స్థాయికి తెచ్చి ... విద్యాలయ పాలకవర్గంవారు ఈ విద్యాలయంలో కనీసం 2 వందల మంది పిల్లలనైనా చేర్పించాలని కోరుతూ ఆంధ్ర, హిందీవిద్యాసంస్థగా ఈవిద్యాలయం అభివృద్ధిచెందాలని ఆశిస్తున్నాను."

స్త్రీ విద్యను గురించి ప్రసంగిస్తూ శ్రీ శాస్త్రిగారు తమ సలహాలిచ్చారు.

రాత్రి భోజనాల అనంతరం ఆలిండియా రేడియో గాయకులు శ్రీ పుట్టా సుబ్బారావుగారు తమ బృందంతో "నేతాజీ అంతర్థాన గాథ" బుర్రకథ రూపంలో చెప్పారు.

కథానంతరం విద్యాలయ వ్యవస్థాపకులు శ్రీ హితార్థిగారు సభాధ్యక్షు ప్రారంభకులకు తమ కృతజ్ఞతాభివందనాలను సమర్పించారు. ఈ వుత్సవం దిగ్విజయంగా జరగడానికి ప్రధాన కారకులైనవిద్యాలయపాలకవర్గంఅధ్యక్షులు శ్రీ ... గోపాలరావుగారి కృషిని శ్రీ హితార్థిగారు ప్రశంసించారు. అంతటితో అన్ని కార్యక్రమాలు దిగ్విజయంగా ముగిశాయి.

స్వ. వి.

## ఆంధ్ర విశ్వవిద్యాలయం

### సెనేట్, సిండికేట్‌లకు మరికొన్ని ఎన్నికలు

కర్నూలు, డిసెంబరు 10: విశాఖపట్టణం నివాసి డాక్టరు బోడపాటితిరుమలరావు, గన్నవరం ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ ఎన్. నరసింహారావు, రాజమండ్రి న్యాయవాది శ్రీ పి. సీతాపతిరావు గారలు ఆంధ్ర విశ్వవిద్యాలయం అకడమిక్ కౌన్సిల్‌కు ఎన్నికైనట్లు ప్రకటించబడింది. 1956 అక్టోబరు వరకు వారు ఆ పదవులలో వుంటారు.

వాల్తేరులోని ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాలకు చెందిన శ్రీ బి. సర్వేశ్వరరావు, కాకినాడ పి. ఆర్. కాలేజికి చెందిన శ్రీ వి. నారాయణరావు, ఏలూరు కాలేజికి చెందిన శ్రీ పి. సుబ్బారావుగారలు ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనెట్‌కు ఎన్నికైనట్లు ప్రకటించబడింది. 1956 అక్టోబరు వరకూ వారు ఆ పదవులలో వుంటారు.

విశాఖపట్నం వైద్య కళాశాలకు చెందిన డాక్టర్ ఎస్. ఎల్. గంటాయత్, విజయనగరం కళాశాల ప్రిన్సిపాల్ డాక్టరు ఎ. ఎల్. నారాయణ, గుంటూరు హిందూ కాలేజి ప్రిన్సిపాల్ వల్లభజోస్యుల సుబ్బారావు గారలు ఆంధ్ర విశ్వవిద్యాలయం సిండికేటుకు నామినేట్ చెయబడ్డారు. సిండికేట్ పునర్నిర్మాణం జరిగేవరకూ వారు ఆ పదవులలో వుంటారు.

## ఆంధ్రరాష్ట్ర పంచాయతీ యూనియన్‌సభ

### పంచాయితీ బోర్డుల అధ్యక్షులకు విజ్ఞప్తి

రాజమండ్రి, డిసెంబరు 10: ఆంధ్ర రాష్ట్ర పంచాయితీల యూనియన్ అధ్యక్షుడు శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు యీ విజ్ఞప్తి చేస్తున్నారు: "ఆంధ్రరాష్ట్ర పంచాయితీల యూనియన్ ఆంధ్రదేశములోని అన్ని మండలములకు వర్తించి పని చేయుటకు ప్రభుత్వమువారు ఆమోదించారు. ఈ ఉత్తరువు ప్రకారము గ్రామపంచాయితీలు, జిల్లా, తాలూకా పంచాయితీ యూనియనులు యీ రాష్ట్రీయ యూనియనుకు అనుబంధముగ చేరవచ్చును. అనుబంధరుసుము సాలుసరి రు 5/-లు మాత్రము. సాలుసరి రు 5/-లు చెల్లించు పంచాయితీలకు గ్రామపంచాయితీ పత్రిక ఉచితముగా పంపబడును.

ఆంధ్రదేశ పంచాయితీల మహాసభ జరుపుటకు ఆంధ్రస్టేటు పంచాయితీల యూనియన్ వారికి ప్రభుత్వమువారు అధికారమిచ్చారు. ప్రథమ ఆంధ్రదేశ పంచాయితీల మహాసభ 1954 సం॥రం ఫిబ్రవరి 6, 7, 8 తేదీలలో నెల్లూరు పట్టణమున టౌన్ హాలులో జరుపబడును. ఫిబ్రవరి 6 వ తేదీని విషయనిర్ణాయ సభ జరుగును. 7 వ తేదీని ప్రథమ ఆంధ్రదేశ పంచాయితీల మహాసభ జరుపబడును. 8-వ తేదీని ఆంధ్రస్టేటు పంచాయితీల యూనియన్ సర్వసభ్యసమావేశము జరుగును. దీనిలో నూతన కార్యనిర్వాహక సభ్యుల యెన్నిక జరుగును. కావున ఆంధ్రదేశములోని వివిధ మండలములలోని పంచాయితీలు ఆంధ్రస్టేటు పంచాయతీల యూనియనుకు అనుబంధ సభ్యులుగా చేరి సభా కార్యక్రమములో పాల్గొన ప్రార్థించుచున్నాను.

ప్రథమ ఆంధ్రరాష్ట్ర పంచాయితీల మహాసభకు సర్ కొంతి రామమూర్తి, (ఐ. సి. యస్.) గారు అధ్యక్షత వహించెదరు. స్థానిక పరిపాలన శాఖామాత్యులు, శ్రీ పి. తిమ్మారెడ్డిగారు, ప్రారంభోపన్యాసము గావించెదరు.

డిశంబరు నెలలోనే ఆంధ్రరాష్ట్ర పంచాయితీల మహాసభ జరుపుటకు మొదట నిశ్చయింపబడెనది. కాని ఆధ్యక్షులను సర్ కొంతి రామమూర్తి పంతులుగారు రాజాస్థాన్‌లో డిశంబరు ఆఖరు వారములో పర్యటన చేయవలసి వచ్చుటచే వారికి డిశంబరు నెల అనుకూలముగ నుండలేదు. మరియు పెక్కు జిల్లాలలో కప్పమూర్పు నుండి వ్యవసాయ తరస్థి అంటుచే తేదీ మార్పు చేయవలసినదిగా కోరుటచే మహాసభ ఫిబ్రవరి నెలలో జరుపుటకు నిశ్చయింపబడెనది. కనుక పంచాయితీ అధ్యక్షులెల్లరు యీ మార్పు గమనించి తమ పంచాయితీలద్వారా మహాసభలో ప్రవేశపెట్టవలసిన తీర్మానములు జనవరి 20 వ తేదిలోగా, పంచాయితీ కార్యాలయమునకు రాజమండ్రికి పంపింప కోరెదను.

కర్నూలు, డిసెంబరు 10: కర్నూలులోని ఉన్నత పాఠశాలల డిప్యూటీ ఇన్‌స్పెక్టరు కార్యాలయం బంగనపల్లికి తరలించబడింది.

## చిత్తూరు మున్సిపల్ మేనేజరు

### స్థానిక సంస్థల మంత్రికి కౌన్సిలర్ల సూచన

చిత్తూరు, డిసెంబరు 9: ప్రస్తుతం, తాత్కాలికంగా ఉద్యోగం నుండి తొలగించబడిన మున్సిపల్ మేనేజరును విచారించే అధికారం, త్వరలో రానున్న కొత్త కమీషనరుకు కాక, స్థానిక సంస్థల ప్రాంతీయ ఇన్‌స్పెక్టరుకు వప్పగించితే బాగుండునని కోరుతూ, శ్రీయుతులు జి. కె. స్వామి, డి. శ్రీనివాసులుశెట్టి, కె. జి. నరసింగరావు వి. ఆర్. నాగరాజ శెట్టి, విశ్వనాథం ఎస్. ఆర్. కృష్ణన్ మిట్టా రంగయ్యశెట్టి గారలు, నిన్న రాత్రి స్థానిక సంస్థల మంత్రి శ్రీ తిమ్మారెడ్డిగారికి ఒక విజ్ఞాపన సమర్పించారు.

చెప్పినదంతా సావధానంగా విని, తగుచర్య తీసుకొంటాననని మంత్రిగారు సమాధానం చెప్పారు.

## భారతీయ సంస్కృతీ సమితి

### బందరులో ఏర్పాటు

బందరు, డిశంబరు 9: ఆంధ్రదేశము లోని కొంతమంది కళాశాలల లెక్చరర్లు 1954 ఏప్రియల్ సిలోన్ దేశమునకు సంస్కృతీ-విద్యా పర్యటన చేయుటకుగాను "ఇండియన్ కల్చరల్ అసెంబ్లీ"ని స్థాపించారు. వీరు ఆంధ్రరాష్ట్రములో గల కళాశాలలన్నిటికి యువకులు, యువతులు సిలోనుకు విమానముపై ప్రయాణము చేసి పని చేయుటకు వచ్చేవారున్నారా అని వ్రాశారు. ఈ సమితివారు సిలోను గవర్నరు జనరల్, ముఖ్యమంత్రి, ఇండియా హైకమీషనరు కొలంబో విశ్వవిద్యాలయం ఛాన్సెలరులతో సంప్రదింపులకు అనుమతికోసం వ్రాసియున్నారు. ఈ సమితి చైర్మన్ వి. రామచంద్రరావుగారు సమితి ప్రయాణము జరుగునని వెల్లడించుచున్నారు.

## ఎన్నికల దావా త్రోసి వేస్తూ తీర్పు

కాళహస్తి, డిసెంబరు 7: కాళహస్తి పంచాయితీ ఎనిమిదవ వార్డుకు తిల్లశెట్టి వెంకటాచలపతి గారు గెలుపొందినట్లు ప్రకటించబడిన ఎన్నిక సక్రమమైంది గాదనీ, అఎన్నిక చెల్లదనీ జొన్నలగడ్డ రామయ్యగారు పెట్టిన దరఖాస్తును కొట్టివేస్తూ, ఈ ఎన్నికల కమీషనరైన తిరుపతి జిల్లా మున్సిఫ్ తీర్పు చెప్పారు. దరఖాస్తు దారుడు ఫిర్యాదులో పేర్కొన్న విషయాలేవీ రుజువు కాలేదంటూ వెంకటాచలపతిగారి ఎన్నికను స్థిరపరచారు.

## పశ్చిమ గోదావరి అర్చక సభ

తణుకు, డిసెంబరు 10: పశ్చిమ గోదావరి జిల్లా అర్చక మహాసభ యిక్కడ కపర్దేశ్వర స్వామి ఆలయంలో శ్రీవాదం పూడిబుచ్చి బాల శంకరంగారి అధ్యక్షతన జరిగినది. జిల్లాలోనివివిధ ప్రాంతాలనుండి ప్రతినిధులు వచ్చారు. ఆంధ్ర రాష్ట్ర సాధనకు అసువు లర్పించిన శ్రీ పొట్టి శ్రీ రాములు గారికి జోహార్లర్పిస్తూ తీర్మానం చేశారు.

శ్రీ ఖండవల్లి వెంకటాచార్యులు గారిని సంఘాధ్యక్షులుగా ఎన్నుకొన్నారు. అర్చక సంఘ విజ్ఞప్తిలోని అంశములను ప్రభుత్వం సానుభూతితో పరిశీలించి, అర్చక సమస్యల విషయంలో ఒక స్థిర నిర్ణయం చేయాలని ప్రభుత్వాన్ని అర్థిస్తూ తీర్మానం చేశారు.

## ఫిబ్రవరిలో చిత్తూరు జిల్లాలో గవర్నరు పర్యటన

చిత్తూరు, డిసెంబరు 9: చిత్తూరు జిల్లాలో రాష్ట్ర గవర్నరు శ్రీ త్రివేది గారు 1954 ఫిబ్రవరినెలలో 3 రోజులు సంచారం చేయనున్నారు. ఈ విషయం తెలుపుతూ వచ్చిన ప్రభుత్వ ఉత్తరువు ననుసరించి పర్యటన కార్యక్రమాన్ని నిర్ధారణ చేయుటకు ఈ దినం కలెక్టరు కార్యాలయంలో జిల్లా కలెక్టరు శ్రీ యాగంటిగారు చాలమంది అధికార, అనధికారులతో ఒక సమావేశం ఏర్పాటు చేశారు. సక్రమంగా చర్చించబడిన పిమ్మట ఉప సంఘం ఏర్పాటు చేయబడినది. (స్వ. వి.)

## సభలు - సమావేశాలు

ప॥ గో॥ జిల్లా చేనేత కాంగ్రెసు కార్యవర్గ సమావేశము 14-12-53 తేదీ సోమవారం మధ్యాహ్నం పాలకొల్లు జిల్లా కార్యాలయంలో సంఘ ప్రెసిడెంటు శ్రీ తాళ్లకోట వీరయ్యగారి అధ్యక్షతను జరుగును. గనుక కార్యవర్గసభ్యులు, ప్రత్యేక ఆహ్వానితులు తప్పక హాజరుకావలసినదిగా కార్యదర్శి సమతం వీరకోటయ్యగారు ప్రకటిస్తున్నారు.

రేపల్లె చేనేత సత్యాగ్రహుల సన్మానసభ సుగ్రం మల్లయ్యగారి అధ్యక్షతన ఈనెల 11 వ పేటేరులో జరుగుతుందనీ ప్రగడ కోటయ్య ప్రభృతులు పన్యసిస్తారనీ, ప్రజలందరూ పాల్గొనాలనీ గ్రామ చేనేత కాంగ్రెసువారు ప్రకటిస్తున్నారు.

కృష్ణాజిల్లా కృషికార్ లోక్‌పార్టీ కార్యవర్గ అత్యవసర సమావేశం ఈనెల 12-వ విజయవాడ పార్టీ కార్యాలయంలో జరుగుతుందని అధ్యక్షులు ప్రకటిస్తున్నారు.

## మద్యనిషేధశాఖనుంచి మాజీసైనికుల బర్తరఫ్

### శాసనసభ్యుని విజ్ఞప్తి

కర్నూలు, డిసెంబరు 10: కోయిలకుంట్ల నియోజకవర్గ శాసనసభ్యుడు ఎస్. వెంకటసుబ్బారెడ్డిగారు ఇలా ప్రకటిస్తున్నారు:

కర్నూలుజిల్లా మద్యనిషేధ శాఖనుంచి ఇటీవల 29 మంది మాజీ సైనికులు తొలగించబడ్డారు. మద్యనిషేధశాఖలో పనిచేసే ఉద్యోగస్థులకుండవలసిన జమాదార్ ధ్యం లేకపోవడంవల్ల వారు ఉద్యోగాలనుంచి తొలగించబడ్డారు. వారు అయిదేండ్లకంటె ఎక్కువ కాలమే సైన్యంలో పనిచేశారు. ఆ తరువాత మద్యనిషేధశాఖలో అయిదారేండ్లనుంచి పనిచేస్తున్నారు. ఇప్పుడు వారు (ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజి) ఉద్యోగాలు చూపించే కార్యాలయంలో తమ పేర్లు (రిజిస్టరు) నమోదు చేయించుకోవాలన్నా వారి దేహదారిద్య్ర లోపం అందుకు ఆటంకం కావచ్చు. కనుక మొదట సైన్యంలో అయిదేండ్లు, ఆ తరువాత మద్యనిషేధ శాఖలోను ప్రభుత్వానికి సేవచేశారు. కనుక, దేశంలో పెరిగిపోతున్న నిరుద్యోగసమస్యదృష్ట్యా వారందరినీ ప్రభుత్వం తిరిగి ఉద్యోగాలలో నియమించడం అవసరం. ఇదివరకే ప్రభుత్వోద్యోగాలలో పదేండ్లపాటు పని చేసిన ఉద్యోగస్థుల జమాదార్ ధ్యం సరిగ్గా వుండాలని ప్రభుత్వం ఇప్పుడు పట్టుపట్టడం సమంజసంకాదు."

## కడప మద్యనిషేధ శాఖోద్యోగులకు గాయాలు

కడప, డిశంబరు 9: ఈ పట్టణంలో నేరాలకు ప్రసిద్ధిచెందిన దున్నురసంట్ల ప్రాంతంపై జిల్లా మద్యనిషేధశాఖాధికారి తన సిబ్బందితో దాడిచేసి ఆరుగాలన్ల దొంగ సారాను స్వాధీనం చేసుకొని పఠాన్ మహబూబ్ ఖాన్, పఠాన్ మొహిద్దీన్ ఖాన్, యాసిం ఖాన్, కాసింఖాన్ అను వారలనూ, మరి ఏడుగుర్ని అరెస్టు చేశారు. అరెస్టు చేసినవారిని వానువద్దకు తీసుకువస్తూండగా నేరస్థులు తిరగబడ్డారు. జిల్లా మద్యనిషేధశాఖాధికారికి, ఆయన సహోద్యోగి మహమ్మద్ మస్తాన్ ఆలీ గారికి, ఒక సబ్ ఇన్‌స్పెక్టరుకు, ముగ్గురు గార్డులకు గాయాలు తగిలినవి.

కడప టవున్ పోలీస్ సబ్ ఇన్‌స్పెక్టరు సి. సుబ్రహ్మణ్యంరెడ్డిగారు ఇండియన్ పీనల్ కోడ్‌లోని 147, 148, 332, 149 నిబంధనలకింద మొత్తం పదకొండుమందిమీద కేసు రిజిష్టరుచేసి దర్యాప్తు సాగిస్తున్నారు.

## దోసకాయలపల్లిలో మద్యనిషేధ దాడి

రాజమండ్రి, డిశం 9: రాజమండ్రి డిప్యూటీ ప్రొహిబిషన్ ఆఫీసరు శ్రీ బి. సత్యనారాయణమూర్తి-సబ్ఇన్‌స్పెక్టరు శ్రీయుతులు సుబ్బరాజు, ఎం. వెంకట్రావుగార్ల సిబ్బంది సహాయముతో దోసకాయలపల్లి గ్రామములో దాడిచేసి 67½ గాలన్ల పారాపూటనా 36 డ్రాములు సారా నూ-సామానుయా పట్టుకున్నారు. ఈ సందర్భమున సబ్ ఇన్‌స్పెక్టరు సుబ్బరాజుగారు 10 మందిని అరెస్టుచేశారు.

ఆఉద్యోగులే దివాన్ చెరువు గ్రామం మీద దాడిచేసి మూడు సారాబస్తీలు పట్టుకొని ఒకరిని అరెస్టు చేశారు.

## కోడంబాకం హైరోడ్డులో మద్యనిషేధోద్యోగుల దాడి

మదరాసు, డిశంబరు 10: మద్యనిషేధ ఉద్యోగులు నిన్న ఉదయం కోడంబాకం హైరోడులో ఒక మోటారు బండిమందు తెస్తుండిన 18 డబ్బాల సారాయం మొత్తం 45 గ్యాలన్లను పట్టుకొన్నారు. ఈ నేరం సందర్భమున మోటారు యజమానిని డ్రైవరును వారు అరెస్టు చేసియున్నారు.

## మద్యనిషేధ నేరాలు

నంద్యాల, డిశంబరు 9: అసిస్టెంటు ప్రొహిబిషన్ ఆఫీసరు శ్రీ వి. సత్యనారాయణగారు సబ్ ఇన్‌స్పెక్టరు శ్రీ ఆర్. రామమూర్తి, పెట్టీ ఆఫీసర్ శ్రీ సి. హెచ్. సుందరరావు గారలు మూర్తుజా అను వానిని అరెస్టుచేసి, 2½ గ్యాలనుల సారాయిని అతని దగ్గర నుండి స్వాధీనపర్చుకొన్నారు. స్థానిక సబ్ మేజిస్ట్రేటుకోర్టులో కేసుపెట్టగా ముద్దాయికి రెండు మాసముల కఠినశిక్ష విధించారు.

సైకిల్ ట్యూబులలో 12 డ్రాముల సారాయిపోసి, పరుపుచుట్టు కట్టుకొని వెళ్తుండగా ఒకరిని అరెస్టు చేశారు. (స్వ. వి.)

## మద్యనిషేధ వుల్లంఘన శిక్షలు విధింపు

బందరు, డిసెంబరు 8: గత వారం లో జిల్లాలోను పట్టణంలోను, పరిసర ప్రాంతాల్లోనూ, 11 వ నెం. సైకిల్ సబ్ ఇన్‌స్పెక్టరు శ్రీ జగన్నాథశాస్త్రి గారు సారాయిమందని తాగిన నేరాలకు, సారాపుంచుకున్నందుకుగాను అరెస్టు చేశారు. సబ్ మేజిస్ట్రేటుగారు 6 గురికి తాగిన నేరానికి ఒకవారం కఠినశిక్ష, అందులో ఒకనికి 25 రూ. ల జరిమానా విధించారు. మిగతా కేసులు విచారణలోవున్నవి.

## ఆర్థిక మంత్రి విశ్వనాథంగారు

కర్నూలు, డిసెంబరు 10: ఆర్థిక మంత్రి విశ్వనాథంగారు డిశంబరు 14న ఇక్కడినుంచి బయలుదేరి మదరాసుకు చేరుకొంటారు. మదరాసు ఆర్థిక మంత్రితో ఆస్తి అప్పుల విభజన విషయం సంప్రదిస్తారు. 18న కర్నూలుకు తిరిగి వస్తారు.

## ప్రభుత్వ ట్రెయినింగు పాఠశాల స్థితి

బందరు, డిసెంబరు 8: ప్రభుత్వ ట్రెయినింగుస్కూలులో యీ సంవత్సరం వేసంగిసెలవల అనంతరం పాఠశాల తెరిచినప్పటినుంచీ ప్రధానోపాధ్యాయపదవి, యిద్దరు అసిస్టెంట్ల పదవులు ఖాళీగానేవున్నవి. విద్యార్థులు ఆ పీరియడ్ల సమయంలో వూరికే వుంటున్నారు. విద్యార్థులకు పాఠములు లేక ...

# కాశ్మీరు రాజ్యాంగ విధాన రచన

## శీఘ్రంగా కొనసాగించడానికి చర్యలు

జమ్మూ, డిసెంబరు 9: జమ్మూ, కాశ్మీరు ధివిష్యత్ రాజ్యాంగ విధాన ప్రాతిపదిక సూత్రాల చర్చకు విడివిడిగా రెండు ఉప సంఘాలను నియమించ నూసెదని, 12 మంది రాజ్యాంగ పరిషత్ సభ్యులను చేర్చుకొని సంయుక్త కమిటీ సంఖ్యను 49 కి పెంచాలనీ సంయుక్త సంఘంవారు ఈ వేళ నిర్ణయించారు. ఈ సంయుక్త సంఘంలో ప్రాతిపదిక సూత్రాల కమిటీ సభ్యులు 22, ప్రాథమిక హక్కులు, పౌరసత్వ కమిటీ సభ్యులు 15 మంది వున్నారు. ఇంకొ 12 మందిని చేర్చుకుంటే 49 మందితో కూడిన ఒకే సంఘం యేర్పడుతుంది.

రాజ్యాంగ విధానాన్ని శీఘ్రంగా రచించడానికి కాశ్మీరు ముఖ్యమంత్రి బక్షీగులాం మహమ్మద్ చేసిన ఈ సూచనను రాజ్యాంగ పరిషత్ అధ్యక్షుడు సాదిక్ ఆమోదించారు. ఈ సంయుక్త సంఘం రేపటినుండి 10 రోజులు సమావేశమై రాజ్యాంగ విధాన స్వరూపమును చర్చిస్తుంది.

రాజ్యాంగ విధాన రచనలో మూడు అంశాలు ఈ సంఘానికి మార్గదర్శకంగా వుంటవి. (1) 1952 ఆగస్టులో చేసిన ప్రకటన విధానానికి సంబంధించిన ఈ ప్రకటనను ఏసెంబ్లీ ఆమోదించింది. (2) నవ కాశ్మీరు కార్యక్రమంలో ఉదహరించబడిన ప్రాతిపదిక సూత్రాలు (3) భారతదేశంతో కాశ్మీరు సంబంధాలు— ఇండియా కాశ్మీరుల క్షేమలాభాలకుగాను ఈ సంబంధాలను యెలా బలపరచాలి అనే విషయము.

కాశ్మీరు భారతదేశంలో ఒక స్వతంత్ర భాగమనే ప్రాతిపదిక పై మీరు రాజ్యాంగ విధాన రచన ఉపక్రమిస్తారు. పూర్వనాయకులు లేవదీసిన సమస్యలన్నిటినీ రాజాచేస్తారు.

ఈ కమిటీ 10 రోజులు చర్చలు జరిపి రాజ్యాంగ విధానమును తయారుచేసి, దాన్ని యింకా చర్చించి ఫిబ్రవరిలో రాజ్యాంగ పరిషత్తుకు నివేదిస్తారు.

వచ్చే రాజ్యాంగ పరిషత్తులో ఢిల్లీ ఒప్పందాన్ని అమలు చేస్తారా? అని అడిగ్గా ఈ ఒప్పందాన్ని రాజ్యాంగ పరిషత్తు భారత పార్లమెంటు యిదివరకే ధృవపరిచాయనీ, వచ్చే రాజ్యాంగ పరిషత్తు సభలో అవి విచారణను వస్తవని, ఢిల్లీ ఒప్పందములోని తక్కిన షరతులనుకూడా అమలు చేయాలని అందరు వాంఛిస్తున్నారని సంయుక్త సంఘ ప్రతినిధి ఒకరు అన్నారు.

# కీలకస్థానాలపై వియెత్‌మిన్ దాడి

## విమానాల్లో అదనపు ఫ్రెంచి సేనలు

హానాయ్, డిశంబరు 10: వియెట్‌మిన్ సేనలు బలీయమైన పర్వతదుర్గం డియెన్‌బీన్‌ఫూపైకి కమ్ముకొని వస్తూ వుండడంవల్ల ఆ దుర్గాన్ని రక్షించడానికిగాను ఫ్రెంచి సైనిక అధిష్ఠానవర్గం వారు నిన్న 103 విమానాలలో కొత్త సేనలను, ఆయుధాలను, సప్లయిలను పంపారు.

12 వేల మంది సైనికులతో కూడిన వైట్ మిన్ డివిజను రెండు భాగాలుగా చీలి డియెన్‌బీన్‌ఫూపై పురోగామి. లాయోస్ రాజధాని అయిన లాయోస్‌పై పురోగామిస్తున్నట్టు నిన్న వార్త వచ్చింది. ఈ వార్త వచ్చిన తరువాతనే అదనంగా సేనలను, సప్లయిలను పంపారు.

# భారత రక్షణశాఖాధికారులకు ఆటం యుద్ధ శిక్షణ

## ఇప్పించే ఆలోచనలేదని రక్షణవ్యవస్థ మంత్రి

న్యూఢిల్లీ, డిసెంబరు 9: భారతరక్షణశాఖ అధికారులకు అటం యుద్ధశిక్షణ ఇప్పించే ఆలోచన ఏదీ లేదని రక్షణవ్యవస్థ మంత్రి మహావీరత్యాగి ఇవ్వాళ ప్రజాసభలో ఒక ప్రశ్నకు జవాబుగా చెప్పారు.

మన రక్షణబలగాలకు 230 కోట్ల రూపాయలు ఖర్చు చేస్తున్నాము కదా, అటంబాంబులు పడే సందర్భంలో కూడా ఇవి మనదేశాన్ని రక్షించగలవని హామీ వున్నదా అని అడగ్గా, రక్షణ మంత్రి స్వీయా కలగచేసుకొని అటువంటి హామీ ఏమీ ఇవ్వజాలమన్నారు. ప్రపంచంలో ఏ ప్రభుత్వం గానీ అటి హామీ ఇవ్వగలదని తాము భావించజాలమన్నారు.

పాకిస్తాన్ సైనికోద్యోగులు 300 మంది బ్రిటన్లో అటం యుద్ధశిక్షణ పొందుతున్నారన్నది తెలుసునా అని అడిగ్గా, తెలియదని కూడా స్వయంగా అన్నారు.

## అండమాన్సుపై కలకత్తా హైకోర్టు అధికారం

న్యూఢిల్లీ, డిసెంబరు 9: కలకత్తా హైకోర్టు అధికారాన్ని చంద్రనాగర్‌కు, అండమాన్సుకు, నికోబార్ ద్వీపాలకు విస్తరించే బిల్లును ప్రజాసభవారు ఈ వేళ ఆమోదించారు.

# ఆస్పత్రిలో జరిగిన ప్రేమకలాపం

హైదరాబాదు, డిశంబరు 10:— క్షయరోగుల ఆస్పత్రికూడ ప్రేమకలాపాలకు తావలం కావచ్చునన్న విషయం సబ్బుగల ఒక యువకుడు యర్రగడ్డ క్షయఆసుపత్రిలో చికిత్సపొందుతుండిన తులసీబాయి అనే ఒక అమ్మాయిని అకస్మాత్తుగా ప్రేమించి, ఆమెను లేవదీసుకొనిపోయి, వివాహం చేసుకొని, దరిమిలాను అరెస్టయిన వృత్తాంతం రుజువు చేస్తున్నది.

హమ్నాబాదు వాస్తవ్యుడయిన గనూబా అనే ఒక యువకుడు అదే ఆస్పత్రిలో చికిత్సపొందుతుండిన తన బంధువు ఒకరిని చూడడానికి వెళ్లాడట. అక్కడ ఈ తులసీబాయి అతని కంటబడి, అతనిని ఆకర్షించిందట. అతడు సమయంకోసం వేచివుండి, ఒక నాడు ఆ అమ్మాయి ఆస్పత్రినుంచి విడుదలై, రిక్షాలో ఇంటికి పోతూవుండగా ఈ యువకుడు రిక్షాను ఆపి, బలవంతంగా ఆమెను లేవదీసుకు పోయాడట. ఆపిల్ల వెంట అదే రిక్షాలో వెళ్తూవుండిన ఆయమ సంరక్షకుడు ఈవిషయం పోలీసులకు తెలియజేశాడట. పోలీసులు ఆ యువకుని యింటిమీదికి దాడిచెల్లి, యువకునిని అరెస్టు చేసి, అమ్మాయిని తమ స్వాధీనానికి తీసుకున్నారు.

(స్వ. వి.)

## వరదబాధితులకు వస్త్రసహాయం

తెనాలి, డిసెంబరు 10: తెనాలి తాలూకా వరదబాధిత కమిటీసభ్యులు శ్రీ ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారి చే కొత్తపేట తాలూకాలోని ఏనుగుల మహల్; రావ్యలి గ్రామములలో 143 ధోవతులు తెనాలి తాలూకా వరద బాధితుల సహాయసంఘం తరఫున పంచిపెట్టబడినవి.

బీహారు శాసనసభకు కేసరి నియోజకస్థానంనుంచి జరిగిన ఉపఎన్నికలో కాంగ్రెస్ అభ్యర్థి శ్రీమతి ప్రభావతీగుప్త నెగ్గారు. ప్రత్యర్థులలో కమ్యూనిస్టు అభ్యర్థి ఈమెకంటె 494 ఓట్లు మాత్రమే తక్కువవచ్చి ఓడిపోయారు. ప్రజాసోషలిస్టు అభ్యర్థికూడా పోటీచేశారు.

# మంత్రివర్గంలో ప్రజా సోషలిస్టు ప్రతినిధి

## ఆచార్య కృపలానికి నచ్చచెప్పడానికి కృషి

మదరాసు, డిసెంబరు 10: ప్రజా సోషలిస్టుపార్టీకి చెందిన పార్లమెంటు సభ్యులు శ్రీ టి. ఎన్. మూర్తి, కె. ఎస్. రఘువాచారిగారలు అఖిలభారత ప్రజాసోషలిస్టుపార్టీ చైర్మన్ ఆచార్య కృపలానీగారిని కలుసుకొని కాంగ్రెసు నాయకత్వాన ఆంధ్రలో అధికారంలో వున్న మిశ్రమ మంత్రివర్గంలో ప్రజాసోషలిస్టుపార్టీ ప్రతినిధి ఒక ముందుకూడా వుండడానికి అనుమతించవలసిన అవసరం నచ్చచెబుతారని తెలుస్తున్నది. నిర్మాణాత్మకంగా ఆంధ్రలో రాజకీయ పరిస్థితిని వారు శ్రీ కృపలానీగారికి పరిచయం చేస్తారట.

శ్రీ కృపలానీగారు అవిఘ్నంగా అనుమతించడానికి ఒక వేళ వీలు లేకపోయినట్టయితే ఈ సమస్యను చర్చించి తమ వైఖరిని నిర్ణయించే అవకాశం ఆంధ్ర ప్రజా సోషలిస్టు పార్టీ కార్యవర్గానికి ఇవ్వవలసిందిగా కృపలానీగారిని కోరవలెనని వారనుకొంటున్నారట. మిశ్రమ మంత్రివర్గాలపట్ల ప్రజాసోషలిస్టు పార్టీ జాతీయ కార్యవర్గం సుముఖం వెలడించింది కనుక, ఆంధ్ర ప్రజాసోషలిస్టు పార్టీలో కొందరు ప్రముఖ నాయకుల అభిప్రాయాల ప్రకారం, విశ్వాసంగాగు ఆంధ్ర మంత్రివర్గంలో చేరడం ప్రజా సోషలిస్టుపార్టీ కార్యవిధానానికి వ్యతిరేకంకాదు.

## మద్రాసు అసెంబ్లీ

మదరాసు, డిశంబరు 9: మదరాసు ప్రభుత్వంవారు రాబోవు సోమవారం నుండి ప్రారంభమయ్యే అసెంబ్లీసభలో మదరాసు రాష్ట్రానికి రూ. 75 లక్షల కంటింజెన్సీ నిధి ఏర్పాటు చేయటానికి బిలునొకటి తెస్తారు. అమ్మకాల పన్ను అపీలు విచారణకు యిద్దరుసభ్యులుగల ట్రిబ్యునల్ ఏర్పాటుచేసే బిలును దానికి సంబంధించిన ఆర్డినెన్సును యీ సభలో ప్రవేశపెట్టారు. మదరాసు వంశపారంపర్య గ్రామోద్యోగుల చట్టం పుదుకోట్టకు వర్తింపచేసే బిల్లుకూడా ప్రతిపాదింపబడుతుంది.

## హైకోర్టు సెలవు

మదరాసు, డిశంబరు 10: మదరాసు హైకోర్టుకు 1954 సంవత్సరం యీ క్రింది సెలవులు యిస్తారు.

మే 8 వ తేదీ సోమవారంనుండి జూన్ 25 వ తేదీ శుక్రవారం వరకు వేసవి సెలవులు.

సెప్టెంబరు 27 సోమవారంనుండి అక్టోబరు 8 శుక్రవారం వరకు మైకలమస్ సెలవులు.

డిశంబరు 20 సోమవారం నుండి డిశంబరు 31 శుక్రవారం వరకు క్రిస్మస్ సెలవులు.

## వెలిగండ్ల ఫిర్కా అవసరాలు జిల్లా జడ్జి స్పెషల్ ఆఫీసరుకు విజ్ఞప్తి

కనిగిరి, డిశంబరు 9: నెల్లూరు జిల్లా బోర్డు స్పెషల్ ఆఫీసరు ఈ నెల 7-వ తేదిన కనిగిరిలో క్యాంపు చేసి వున్న సందర్భంలో శాసన సభ్యులు శ్రీ జి. యల్లమందా రెడ్డిగారు వారిని కలుసుకొని తాలూకా సమస్యలపై ఒక విజ్ఞాపన సమర్పించారు.

కనిగిరి తాలూకాలో వెలిగండ్ల ఫిర్కాలో ఎలాంటి రోడ్డు సౌకర్యములు లేవని ఈ ప్రాంతములో మొగిలిచర్లనుంచి హనుమంతాపురముకు వేయవలసిన రోడ్డును వెంటనే ప్రారంభించాలని విజ్ఞాపనలో కోరారు.

ఆ ఫిర్కాలో నాగులవరములో ఒక డిస్పెన్సరీ ఏర్పాటు చేయమని, కనిగిరి హైస్కూలులో స్కూలు ఫైనలు పరీక్షా కేంద్రాన్ని తప్పక వుంచునట్టు చూడాలని కూడా విజ్ఞాపనలో కోరారు.

సావధానంగా విని, వెంటనే రోడ్డు పని ప్రారంభించటానికి, గ్రామస్థులు ఆస్పత్రి షెడ్డు వేయించి యిస్తే డిస్పెన్సరీ ఏర్పాటుచేయుటకు కృషి చేస్తానని స్పెషల్ ఆఫీసరు వాగ్దానం చేశారట.

## తెనాలిలో సమాజవాద యువజన సంఘం

తెనాలి, డిశంబరు 10: పట్టణ ప్రజా సోషలిస్టు పార్టీ ఆఫీసులో యీ నెల 5-వ తేదీన మందిరపు కామేశ్వరరావు గారి అధ్యక్షతను జరిగిన సభా వేళయందు శ్రీ క్రీవి రామారావుగారు సమాజవాద యువజన సంఘమునకు ప్రారంభోత్సవము జరిపారు. శ్రీయుతులు వంకాయల సుబ్బారావు, మోటుపల్లి రామారావు గారు సంఘ ఆదర్శములను గురించి ప్రసంగించారు. శ్రీ కొమ్మన సబ్బారావు లీడరుగాను, శ్రీకరం యింద్రయ్య కన్వీనరుగాను మరి కొందరు సభ్యులతోను కార్యవర్గం ఎన్నుకోబడినది. కమ్యూనిస్టు "పట్టి పరిశ్రమ(ల) దారులలో" చేర్చిన మోటార్ మరి కొందరు ప్రజాసోషలిస్టులను అరెస్టు చేసిన బొంబాయి ప్రభుత్వ చర్యను గర్హిస్తూ వెంటనే వారిని విడుదల చెయ్యవలసినదిగా తీర్మానించారు.

కాన్పేరా రేవు పనివాళ్ళు సాగిస్తూ వచ్చిన 2 వారాల సమ్మె డిసెంబరు 10 ఉదయం విరమించారు. ప్రభుత్వం సమ్మె అక్రమం అని ప్రకటించింది.

# స్థానిక సంస్థలలో ఉద్యోగనియామకాలు

## ప్రభుత్వ పరిశీలనలో వున్న కొత్త సూచన

కర్నూలు, డిసెంబరు 11: పురపాలక సంఘాలూ ఇతర స్థానిక సంస్థలూ యేర్పాటే ఖాళీలకు శిక్షితులైన ఉద్యోగులనూ, మామూలు ఉద్యోగులనూ, సాంకేతిక ప్రవీణులనూ నియమించేటప్పుడు ఉద్యోగాలు చూపించే కార్యాలయాన్ని (ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజి) సంప్రదించాలనే సూచన గురించి ప్రభుత్వం పరిశీలిస్తున్నట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది. ఆయా స్థానిక సంస్థలు తమకు కావలసిన ఉద్యోగుల కొరకు ఆయా ప్రాంతాలలోని ఉద్యోగులు చూపించే కార్యాలయాన్ని సంప్రదించవలసి వుంటుంది. ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజి కార్యాలయోద్యోగులు అనధికృత మదరాసు రాష్ట్ర ప్రభుత్వానికి ఈసూచన చేసినట్టున్నా, విభజన కారణంగా ఈ సమస్య గురించి ప్రభుత్వం అప్పుడు ఏనిర్ణయమూ చేయ లేదనిన్నీ తెలుస్తున్నది. ఈసూచనను ప్రభుత్వం ఆమోదించినట్లయితే స్థానిక సంస్థలలో ఉద్యోగ నియామకాలలో ఆశ్రిత పక్షపాతం మొదలైనవి చాలా వరకు తగ్గిపోగలవు అంతేకాక ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజి కార్యాలయాలలో పేర్లు నమోదు చేయించుకొన్న నిరుద్యోగులకు అకార్యాలయాలు ఇంకొ ఎక్కువగా ఉద్యోగాలు చూపించే అవకాశం వుంటుంది. ఉద్యోగం కావలసిన ప్రతి నిరుద్యోగీ తన పేరు ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజి కార్యాలయంలో నమోదుచేయించుకొని దానిసహాయం పొందే వీలుంటుంది.

## కర్నూలు విద్యార్థుల సంఘ సేవ

కర్నూలు, డిసెంబరు 10: ఇక్కడికి దగ్గరలో వున్న వెలుపనూరు గ్రామంలో క్రిస్మస్ సెలవులలో సంఘసేవా కార్యక్రమాలలో పాల్గొనవలెనని ఇరష్టైమంది ఉస్మానియా కాలేజి విద్యార్థులు నిర్ణయించుకొన్నారు. ఈ నెల 25 వ తేదీన మంత్రి సంజీవయ్యగారు ఈ సమాజసేవా కేంద్రానికి ప్రారంభోత్సవం జరుపుతారు. ఉస్మానియా కాలేజి అధ్యాపకులు శ్రీ ఖాదర్ నాగరాజన్ గారలు, శ్రీ వెంకటస్వామి అనే విద్యార్థి ఆకేంద్రాన్ని నడుపుతారు.

## కర్నూలులో టెలిగ్రామ్ టెలిఫోన్ సౌకర్యాలు

కర్నూలు, డిసెంబరు 10: ఈ పట్టణంనుంచి ఇతరప్రాంతాలకు పంపించే టెలిగ్రాములను టెలిఫోన్ సౌకర్యంవున్నవారు తమ టెలిఫోన్ల ద్వారా టెలిగ్రాఫ్ కార్యాలయానికి పంపించేసౌకర్యం ఈ నెల 11 వ తేదీనుంచి ఏర్పాటు చేయబడుతుందని ఆంధ్రపోస్టల్, టెలిగ్రాఫ్ డైరక్టరు నేడు చేసిన ప్రకటనలో వున్నది. ఈ యేర్పాటువల్ల ఈ పట్టణంలో టెలిఫోనులువున్నవారికి ఇతర ప్రాంతాలనుంచివచ్చే టెలిగ్రాములను వారి టెలిఫోన్ల ద్వారాకూడా తెలియచేస్తారు.

## శబరిరిజర్వాయరు ప్రాజెక్టు

### ఈ పంచవర్ష ప్రణాళికలోనే చేర్చాలని రైతులవిజ్ఞప్తి

రాజమండ్రి, డిసెంబరు 9: "శబరీ రిజర్వాయరు కట్టినయెడల సుమారు నాలుగులక్షలబస్తాలు ధాన్యం తూర్పు పశ్చిమ, మధ్యజిల్లాలలోను అదనంగా పండించవచ్చును. ఇందుకు అయ్యేఖర్చు కొంత ప్రజలు యిచ్చుటకు సిద్ధముగానున్నారు. వెంటనే రయితుల వద్దనుంచి నామమాత్ర వాయిదాలమీద వసూలు చేయుటకు శాసనం చేసి ప్రభుత్వం శబరిరిజర్వాయరు ప్రస్తుత పంచవర్ష ప్రణాళికలో పూర్తి చేయవలెను" అని. యీ నెల 6 వ తేదీన తూర్పు పశ్చిమ గోదావరిజిల్లాల రైతుల అసోసియేషన్ వారు ప్రత్యేక సభలో తీర్మానించారు. ఈ సభకు శ్రీ ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్ గారి అధ్యక్షతన దవళేశ్వరంసభ హాలులో జరిగినది. ఈ సభవారు ఆమోదించిన ఇతర తీర్మానాలివి.

రెండవ పంటకు నీరు పూర్తిగా సప్లయి చేయించాలి. వరదలలో దెబ్బతిన్న గ్రామములకు యితర ప్రాయింపు చెల్లించాలి. గోదావరిగట్లు దెబ్బతినుచుండగా యిచ్చేపరిహారం వెంటనే రైతులకు అందేటట్లు చూడాలి. ఆక్రమణదారునిగాని దానిని అనుకొనిగాని రొప్పలేటలు వంతెన నిర్మించాలి. ముకేశ్వరమునుంచి కొత్తపేటవరకు కాలవమీద రోడ్డును వేసి 20 గ్రామముల ప్రజలకు రాకపోకల సౌకర్యం ఏర్పాటు చెయ్యాలి. గోవిమీ వాణిజ్యమండలి అధ్యక్షుడు శ్రీ నాగవరపు శేషగిరిరావుగారిని యీ అసోసియేషనకు ఉపాధ్యక్షులుగా ఎన్నికచేశారు.

రెండవసారి సభకు శ్రీ బోర్ల సుబ్బారావుగారు అధ్యక్షతవహించిన కార్యవర్గ వందనములతో సభ ముగిసినది.

# క్రీడారంగం

## సౌత్‌జోన్ పోలీస్ హాకీలో హైద్రాబాదు ఓటమి

హైదరాబాద్, డిశంబరు 10: ఈ వేళ యిక్కడ సౌత్‌జోన్ పోలీసు హాకీ సెమిఫైనల్సులో గత సం॥ హోల్డర్ అయిన బొంబాయి పోలీసు జట్టు హైద్రాబాద్ పోలీసు జట్టును 2 గోలుల తేడాతో ఓడించింది (2-0).

## అఖిల భారత టెన్నిస్: మద్రాసు ప్రతినిధులు

మద్రాసు, డిశంబర్ 10: ఈ నెలచివరివారంలో కలకత్తాలో జరిగే అఖిల భారత టెన్నిస్ పోటీలకు మద్రాసురాష్ట్రం తరఫున ఆర్. కృష్ణన్, ఎస్. విష్ణుమోహన్, సి. వి. జి. అప్పారావు, ఎ. జె. ఉదయకుమార్ లుపాల్గొంటారు. జూనియర్స్ తరఫున ఆర్. కృష్ణన్, అక్బర్ ఖలీస్ పాల్గొంటారు.

## జావెలిన్‌త్రోలో అమెరికన్ రికార్డు

లాస్ఏంజలిస్, డిశంబరు 10: ఇంతవరకు అమెరికా జావెలిన్ త్రోలో అధికారరీత్యా 268అ. 10 అం॥ రికార్డును నెలకొల్పినట్లు గుర్తించబడ్డ బి. హేల్డును మాజీ అమెరికన్ చాంపియన్ డా॥ స్టైవ్ సేమూర్ నేడు విమర్శిస్తూ ఒక ప్రకటన చేశారు. ఈ విమర్శనలో 1952 ఒలింపిక్ చాంపియన్ యంగ్ కూడా దీనితో ఏకీభవించారు.

హెల్డు ఉపయోగించిన జావెలిన్ మామూలుగా ఉపయోగించే జావెలిన్ వంటిది కాదనీ, మామూలు కన్నా మరి 20 అడుగులు పోవటానికి వీలుగా తేలికగా, నిర్మించబడ్డదనీ, ఇటువంటి రికార్డును ప్రపంచ రికార్డుగా ప్రతిపాదించటానికి ప్రయత్నించటం క్రీడావినోదాలనుపరిహాసము చేయుటమే అవుతుందనీ వారొక ప్రకటనలో విమర్శించారు.

## విశాలాంధ్ర ఆటల పోటీలు

గుంటూరు జిల్లా సత్తెనపల్లిలో ప్రతి నరసింహారావు మెమోరియల్ విశాలాంధ్ర ఆటలపోటీలు జనవరి 8 నుంచి జరుగుతవనీ, జనవరి 1లోగా దరఖాస్తులు పెట్టుకోవాలనీ నిర్వాహకులు శ్రీ జగన్నాధరావుగారు తెలియజేస్తున్నారు. వాలీబాల్, బాడ్మింటన్, చెడుగుడు, 1000 మీటర్ల పరుగు, లాంగ్ జంప్, హైజంప్, అర మైలు పరుగుపోటీలు జరుగుతవి.

## కర్నూలుజిల్లా ఆటల పోటీలు

మార్కాపురం, డిసెంబరు 8: ఈ పట్టణములో ఈసంవత్సరము కర్నూలు జిల్లా పెంట్లాండ్ స్పోర్ట్సు జరుపుటకు కేంద్రముగా నిర్ణయించినారని యూథిక్ తెలియుచున్నది. ఈ పందెములు జనవరి నెల మొదటివారములో జరుగును. స్థానిక బోర్డు ఉన్నత పాఠశాలాధికారులు తగు ఏర్పాట్లు చురుకుగా చేయుచున్నారు. (స్వ. వి.)

## విజయవాడ రైల్వే క్రికెట్

విజయవాడ, డిశంబరు 8: మొన్న యిక్కడ అరక్కోణం రైల్వే యిన్స్టిట్యూటుకు, విజయవాడ రైల్వే యిన్స్టిట్యూటు జట్లుకు జరిగిన క్రికెట్ పోటీలో 8 వికెట్లతో అరక్కోణం జట్టు గెలిచింది. విజయవాడ జట్టు 39 పరుగులకు అందరు ఔటు అయినారు. అరక్కోణం జట్టు మూడు వికెట్ల నష్టానికి 51 పరుగులు చేశారు. (స్వ. వి.)

## క్విజ్‌క్లబ్బు పోటీలు

బందరు, డిసెంబరు 6: బందరు హిందూ కాలేజి క్విజ్ క్లబ్బు ఆధ్వర్యమున నిన్న సాయంకాలము క్లబ్బు పోటీలు హిందూ కాలేజీ హాలులో జరిగెను. ఈ పోటీలలో బెజవాడ కాలేజి స్థానిక నేషనల్ కాలేజి, హిందూ కాలేజి జట్టులు పాల్గొనినవి. గుంటూరు ఎ. సి. కాలేజి లెక్చరరు పి. ఎస్. సోమయాజులు గారు పోటీలు జరిపారు. హిందూ కాలేజి లెక్చరరు జి. వి. నాగారావుగారు అధ్యక్షత వహించారు. హిందూ కాలేజిజట్టు చాంపియన్‌షిప్ సంపాదించింది. హిందూ కాలేజిజట్టును ప్రథమ బహుమతియూ, బెజవాడ కాలేజిజట్టు రెండవ బహుమతినివ్వబడెను. క్లబ్బు కార్యదర్శి యస్. వెంకటేశ్వరరావు గారు కృతజ్ఞతావందనము అర్పించారు. (స్వ. వి.)

# కాందిశీక చరాస్తి ఒప్పందం

## జనవరినుంచే అమలు జరపడానికి పాకిస్తాన్ నిర్ణయం

కరాచీ, డిసెంబరు 10: కాందిశీక చరాస్తి విషయమై పాక్. భారతదేశాల ఒప్పందాన్ని వచ్చే జనవరి 1 నుంచీ అమలు జరపడానికి పాకిస్తాన్ నిశ్చయించింది.

## తాడేపల్లిగూడెంలో ధాన్యం ధరలు

తాడేపల్లిగూడెం, డిసెంబరు 10: ఈ వేళ యిక్కడ ధాన్యం, బియ్యం ధరలు ఈ విధంగా ఉన్నవి.

ఎగుమతి:

బియ్యం: (రెండు ఇంపీరియల్ మణుగుల బస్తా)

| | |
|---|---|
| బసంగి | 29-0-0 |
| అక్కుళ్లు (కొత్తవి) | 29-8-0 |
| కృష్ణకాటుకలు (పాతవి) | 42-0-0 |
| సన్న కృష్ణకాటుకలు | 42-8-0 |
| కిచిలీ సాంబాలు | 43-0-0 |
| వంకసన్నాలు | 45-0-0 |
| ఉప్పుడు బియ్యం: | |
| నల్లాలు (దాళ్వా) | 30-0-0 |
| బుడెలు | 30-0-0 |
| బసంగి (సిద్ధంగా ఉన్నది.) | 32-4-0 |
| ,, (జట్టీ పద్ధతి) | 32-0-0 |
| ,, (ముక్కపాయ రకం) | 31-8-0 |
| అక్కుళ్ళు (కొత్తవి) | 31-0-0 |

స్థానికంగా ధరలు:

ధాన్యం: (రెండు ఇంపీరియల్ మణుగుల బస్తా)

| | |
|---|---|
| బసంగి | 18-10-0 |
| గరికెసన్నాలు | 19-0-0 |
| అక్కుళ్లు (పాతవి) | 21-8-0 |
| అక్కుళ్లు (కొత్తవి) | 18-8-0 |
| కృష్ణకాటుకలు (పాతవి) | 22-8-0 |
| ,, (కొత్తవి) | 19-8-0 |
| సన్న కృష్ణకాటుకలు పాతవి | 22-8-0 |
| ,, కొత్తవి | 20-0-0 |
| వంకసన్నాలు | 25-0-0 |

## మదరాసు ధరలు

మదరాసు, డిశంబరు 11:

బంగారు-వెండి షేటుముద్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎప్వర్డుబోమ్మ సేల్సుటాక్సుతో సహా రూ. 56-14-0

| | | |
|---|---|---|
| పెట్లా బంగారు తులం | రూ. | 82-8-0 |
| మూస బంగారు | రూ. | 81-4-0 |
| పిమవెండి తులం100 కి రెడీ | | 153-8-0 |
| చిల్లర ధర | రూ. | 1-9-0 |

### వేరుశనగ:

(581 పౌ॥ 1-కి ఎక్స్‌పోర్టు గిడ్డంగులు మెషీన్- సేల్సుటాక్సుతో సహా) రూ. 144-146

వేరుశనగనూనె ఎక్స్ మిల్లర్ టిలో 3% (500పౌ.) రెడీ చిల్లరధర రూ. 285-0-0

టెంకాయనూనె (37½ పౌనులు గల)

| | | |
|---|---|---|
| అంబుమార్కు | రూ. | 32-8-9 |
| ఎం.ఎస్. బ్రాండ్ డబ్బా | | 32-8-9 |
| రాజా బ్రాండ్ | రూ. | 32-0-9 |

### ఆముదం

600 పౌనులు గల బారువ ఒకటికి తిరుపత్తూరు రూ. 280-0-0

వేలూరు జూపిటర్ బ్రాండ్ 37½ పౌ. 22-0-9

సిలం లోటస్ ప్యాన్ బ్రాండ్ 37½ పౌ. 23-0-9

### పత్తి దారం

కొన్నూరు(2 అందరు) 96-8-9-97-0-9

## బొంబాయి మార్కెట్

బొంబాయి, డిశంబరు 11: ఇవాళ బొంబాయి మార్కెట్ ధరలు ఈ విధంగా వున్నవి.

| | |
|---|---|
| వెండి (100 తు.) | 152-7-0 |
| బంగారం (1 తు.) | 81-4-0 |
| సావరిన్ | 56-4-0 |

కలకత్తా ధరలు: — 150-12-0 81-13-0 సావరిన్ 57-0-0.

# రేడియో

## ఆదివారం, డిశంబర్ 13 తేదీ

### విజయవాడ

ఉ॥ 6-55 స్వాగతం 7-0 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె 7-30 మద్రాసు (ఎ) వలె 8-0 అంగ్లమున వార్తలు.

మ॥ 1-0 మద్రాసు (ఎ) వలె 1-30 మద్రాసు (ఎ) వలె 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 4-0 బొమ్మరిల్లు.

సా॥ 5-30 కర్లపాలెం చంద్రమౌళి 6-0 గీతావళి బి. హెచ్. సీతామహలక్ష్మి 6-15 స్థానిక ప్రకటనలు వాతావరణం 6-20 భజన్ 6-30 గ్రామస్థుల కార్యక్రమం 7-0 తెలుగున వార్తలు 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 'గనీ' హిందుస్తానీ గాత్ర సంగీతం 8-0 మంగళంపల్లి బాల మురళీకృష్ణ (గాత్రం) 8-50 పార్లమెంటు కార్యక్రమ సమీక్ష (అంగం) 9-0 ఆంగ్లమున వా॥ 9-15 గీతావళి బి. హెచ్. సీతామహాలక్ష్మి (రి).

### మద్రాసు (ఎ)

ఉ॥ 6-55 స్వాగతం 7-0 వాద్యసమ్మేళనం 7-15 తమిళమున వా॥ 7-30 ఉదయగానము (రి) 8-0 అంగ్లమున వార్తలు.

మ॥ 1-0 చిదంబరం కె. వి. లక్ష్మి (గాత్రం) 1-30 గీత మంజరి (రి) 1-40 హిందీలో వా॥ 1-50 కొత్తమంగళం వి. ఎస్. శ్రీనివాసన్ (రి) 2 తమిళమున వా॥ 2-10 గానమంజరి (రి) 2-30 గీతిశాగుచ్ఛం బి. ఎస్. బాలసుబ్రహ్మణ్యం (గాత్రం) 4 పోలియున్న దీపం (మళయాళ నాటిక) 4-15 పోలిగావసిద్ధి (కన్నడ నాటిక) 4-30 పాశ్చాత్యసంగీతం.

సా॥ 5-30 కె. ఆరావముదన్ (గాత్రం) 6 అంగ్లమున వా॥ 6-10 యస్. నీలాయతాక్షి యస్. మీనాక్షి 6-45 మక్కోల్ యస్. వరదరాజన్ (గాత్రం) 7-15 తమిళమున వార్తలు 7-30 ముసిరి సుబ్రహ్మణ్యఅయ్యర్ (రి) 7-45 జి. పొన్నమ్మాల్ గాత్రం 8-30 మద్రాసు (బి) వలె 9 ఆంగ్లమున వా॥ 9-15 గోష్ఠిగానము 9-45 పాశ్చాత్యసంగీతం (రి).

### మద్రాసు (బి)

ఉ॥ 6-55 మద్రాసు (ఎ) వలె 7 తెలుగున వా॥ 7-15 పురందరదాస్ కృతులు (రి) 7-30 పిల్లలకార్యక్రమం (తమిళం) 8 మద్రాసు (ఎ) వలె.

మ॥ 1 మద్రాసు (ఎ) వలె 1-30 అంగ్లమున వార్తలు 1-40 లలితా వెంకటరామన్ (రి) 1-50 తెలుగున వార్తలు 2 వేణువు నిలయవిద్వాంసుడు 2-15 ఆటవిడుపు 3 మద్రాసు (ఎ) వలె 4 గీతమాలిక (రి) 4-30 మద్రాసు (ఎ) వలె.

సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె 6-10 వీణ సితార్ (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం 7-30 మద్రాసు (ఎ) వలె 7-45 శ్రోతల పరిచయం 8.0 మద్రాసు (ఎ) వలె 8-30 టి. ఆర్. రత్నవేలు మొదలియార్ వయొలిన్ 9.0 మద్రాసు (ఎ) వలె 9-45 పరాంకుశదాసర్ కృతులు (రి) 10-0 శ్రోతలు కోరిన పాటలు (రి).

### హైదరాబాదు

ఉ॥ 6-55 సుప్రభాత్ (రి) 7-0 తెలుగున వా. 7-40 వి. ఆర్ ధనం (గాత్రం) 7-45 గీత్ 8-0 అంగ్లమున వా. 8-15 హిందీలో వా. 8-30 గులామ్ మహమ్మద్ ఖాన్, ఖయాల్ 8-45 ఘజలే 9-0 ఆవో బచ్చో పిల్లల కార్యక్రమం (ఉర్దూ) 9-45 బాలవినోదం ఏవరెస్టువిజయం నాటిక

మ॥ 12-30 మిలే జులేగాన్ (రి) 12-50 మరాఠీలో వా. 1-0 సైగల్ సహాలే అలాప్ ఖయాల్ 1-30 గీత సుధ (రి) 1-50 తెలుగున వా.

సా॥ 5-30 ఎమ్. జనార్దన్ సితార్ 5-45 ఘజలే 6-0 మరాఠీలో కార్యక్రమం 6-30 గీత్ (రి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ 7-0 తెలుగున వా. 7-15 గ్రామసీమ 7-45 కన్నడమున వా. 8-0 వి. ఆర్ ధనం (గాత్రం) 9-0 అంగ్లమున వా. 9-15 ఉర్దూలో వా. 9-30 ఎమ్ జనార్దన్ సితార్ 9-45 ఘజలే 10.0 గులాం మహమ్మద్ ఖాన్ ఖయాల్ అడానా.

# చేబ్రోలు అన్నదాన సత్రం

కర్నూలు, డిసెంబరు 10: గుంటూరు జిల్లా చేబ్రోలులోని అన్నదాన సత్రాన్ని ప్రస్తుతం దానిని నిర్వహించేవారు సరిగ్గా నడపడం లేదని వచ్చినట్లు చెప్పబడుతున్న ఫిర్యాదుల కారణంగా ప్రస్తుతం ఒక మేనేజరు దక్కగా నిర్వహించబడడానికి అనుగుణంగా ప్రభుత్వం చర్యలు తీసుకోవటం మొదలుపెట్టినట్లు నేడొక ప్రకటన వెలువడింది.

# విజయవాడలో ఆంధ్రలయోలా కళాశాలకు శంకుస్థాపనోత్సవం



శంకుస్థాపన సందర్భంలో ఆంధ్రగవర్నరు ప్రసంగిస్తున్న దృశ్యం.



ఆంధ్ర లయోలా కళాశాల 'గోగినేని హాస్టలు'కు గోగినేని వెంకట సుబ్బయ్య నాయుడుగారు ఈనెల 9 తేదీనాడు శంకుస్థాపన చేశారు.



విజయవాడ ఆంధ్రలయోలాకళాశాల శంకుస్థాపనోత్సవం సందర్భంలో ఆ ఉత్సవం తాలూకు జ్ఞాపక శిలాఫలకాన్ని తిలకిస్తున్న ఆంధ్రగవర్నరు శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేది



గుణదలలో ఆంధ్రలయోలాకళాశాలకు చెందిన 'గోగినేని హాస్టలు'కు గోగినేని వెంకట సుబ్బయ్యనాయుడుగారు శంకుస్థాపన చేసినప్పటి చిత్రం. ఈ ఉత్సవసభకు చల్లపల్లి రాజా యార్లగడ్డ శివరామప్రసాదుగార్లు అధ్యక్షత వహించారు.



ఆంధ్రగవర్నరు దంపతులు విజయవాడలో గుజరాతీమండలిని దర్శించినప్పటి దృశ్యం.



గవర్నరు శ్రీ త్రివేది దంపతులు విజయవాడ గుజరాతీమండలివారి స్వాగతపత్రం స్వీకరించి నప్పటి చిత్రం.

# దక్షిణ కొరియా ప్రభుత్వ పక్షంలో ముసలం

## ఉపాధ్యక్ష ప్రభృతులపై బహిష్కరణ

సేవూల్, డిసెంబరు 10: దక్షిణకొరియా ప్రభుత్వ పక్షమయిన లిబరల్ పార్టీ కేంద్ర సంఘం ఈ వేళ తన ఉపాధ్యక్షుడయిన లీబంసక్‌ను బహిష్కరిస్తూ నేడు నిర్ణయం చేసింది. లీబంసక్ 1945 నుంచీ కొరియా రాజకీయాల్లో ప్రముఖపాత్ర ధరిస్తూ వచ్చినవ్యక్తి. ఇటీవలనే 6 నెలలపాటు ప్రపంచ పర్యటన చేసివచ్చారు.

ఈయన్నేకాక మరి 7 గురు ప్రముఖ సభ్యులను కూడా లిబరల్ పార్టీ బహిష్కరించింది. వీరిలో మాజీ హోం మంత్రి చింగ్ హ్యోన్ షెక్, మాజీ వాణిజ్య మంత్రి లీ బో యొ హ్యోంగ్‌లు ఉన్నారు. ఈ మంత్రులిద్దరిమీదను ప్రస్తుతం కమ్యూనిస్టు కుట్ర కేసు విచారణ జరుగుతున్నది.

లీబంసక్‌ను ఎందువల్ల బహిష్కరించారో కారణం మాత్రం చెప్ప లేదు.

నేడు పాన్ ముంజాన్‌లో అమెరికన్ ప్రతినిధి డీన్ తన ప్రణాళికను ఆమోదించమని కమ్యూనిస్టులను కోరగా వారు నిరాకరించారు. రష్యా కొరియా రాజకీయ సమావేశంలో పూర్తి సభ్యుని హోదాలో పాల్గొనాలని డీన్ కోరగా, తటస్థదేశంగా మాత్రమే పాల్గొంటుందని కమ్యూనిస్టులు జవాబిచ్చారు. తన ప్రణాళిక మీద కమ్యూనిస్టులు ఏమయినా సూచనలు చేయవచ్చుననీ, వాటిని తాను పరిశీలించవచ్చుననీ ఆయన అన్నారు.

స్వదేశానికి తిరిగి రావటానికి నిరాకరిస్తున్న దక్షిణ కొరియన్ ఖయిదీల మనసు మార్చటానికి మిత్రరాజ్యాధికారులు చేస్తున్న ప్రయత్నాలు ఈ వేళ కూడ విఫలమయిపోయినవి. ఇప్పటికి 220 మంది ఖయిదీలకు నచ్చచెప్పగా. ఒక్కరు కూడ మనసు మార్చుకోలేదు.

ఉత్తర కొరియన్ ఖయిదీల శిబిరానికి కమ్యూనిస్టు వ్యతిరేక చర్యలు జరపటానికి సూచనల నందజేస్తున్న ఒక ఖయిదీ పట్టుబడినట్లు భారతీయ కాపుదారీ దళోద్యోగి ఒకరు నేడు తెలియజేశాడు.

# జనరల్ మార్షల్‌కు 'శాంతి' బహుమానం

## సమావేశంలో నిరసన

ఆస్లో, డిసెంబరు 10: "జపాన్ మీద అటంబాంబులు వేయించి, లక్షమంది జనం శీఘ్రంగా ప్రాణాలతో నే కాలిపోవటానికి కారకుడయిన వ్యక్తికి శాంతి బహుమానం ఇవ్వటం అన్యాయం. ఇది నోబెల్ బహుమానాలను దుర్వినియోగపరచట మవుతోంది" అని వ్రాసిఉన్న కరపత్రాలు నేడు నోబెల్ బహుమాన సంఘం అమెరికన్ ప్రముఖుడు జనరల్ జార్జ్ మార్షల్‌కు శాంతి బహుమానం ఇవ్వటానికి ఏర్పాటు చేసిన సభలో వెదజల్లబడ్డవి.

కరపత్రాలు రెండుసార్లు సభికుల మీద వెదజల్లబడ్డవి. వాటిని చల్లిన యువకుని లిప్తకాలమైనా సభికులు కొట్టి పోయినారు.

బ్రిటిషు ప్రధాని చర్చిల్ కివ్వబడ్డ నోబెల్ సారస్వత బహుమానాన్ని ఆయన తరఫున ఆయన భార్య అందుకున్నది.

# ప్రాచ్య దేశాల ప్రధాన మంత్రుల సమావేశాలు

## సింహళ ప్రధాని సూచన

కొలంబో, డిసెం 10: ఇండియా, పాకిస్తాన్, బర్మా, ఇండొనేషియా, సింహళ ప్రధానులు తరుచుగా, సంవత్సరానికి ఒకటి రెండు సార్లయినా సమావేశమై అందరికీ సంబంధించిన సమస్యలను, చర్చించడం అవసరమని సింహళ ప్రధాని సర్ జాన్ కొట్లావాలా ఈ వేళ యిక్కడ కోరారు. "ఇట్టి సభలు జరగడంవల్ల ఐక్యము, స్థిరత్వమూ ఏర్పడుతుంది. ఈ ప్రాంతపు వ్యవహారాలను ఈ ప్రాంతంవారే పరిష్కరించుకోగలరని స్పష్టం కావడం వల్ల యితర దేశాలకు ఈ ప్రాంతంపై గౌరవం యేర్పడుతుంది" అని సర్ జాన్ సింహళ ముస్లిమ్‌లీగు తన గౌరవార్థమై చేసిన విందులో ఉపన్యసిస్తూ అన్నారు. ఈ విందుకు భారత హైకమిషనరు శ్రీ దేశాయి, పాకిస్తాన్ హైకమిషనరు హాజీ అబుల్ సత్తార్, ఇండోనేషియన్ రాయబారి హాజరయినారు.

సింహళములోని ముస్లిములు సింహళీస్ భాష నేర్చుకోవాలని సర్ జాన్ ఉద్బోధించారు.

# తుంగభద్ర పై కర్నూలు వద్ద బ్రిడ్జి

## హైద్రాబాద్ ప్రభుత్వ వైఖరి

కర్నూలు, డిసెంబరు 11: హైద్రాబాద్ జెంగునూరు జాతీయ రహదారిలో తుంగభద్రానదికి రోడ్ బ్రిడ్జి నిర్మించాలని కేంద్ర ప్రభుత్వాన్ని గట్టిగా కోరే విషయంలో ఆంధ్ర ప్రభుత్వంతో కలిసే విషయం పట్ల హైద్రాబాద్ ప్రభుత్వం శ్రద్ధ వహించడం లేదని తెలుస్తున్నది. రంగా రెడ్డిగారు పబ్లిక్ వర్క్సు మంత్రిగా వున్నప్పుడు ఈరోడ్ బ్రిడ్జి నిర్మాణస్థలాన్ని కర్నూలునుంచి రాయచూరుకు మార్చడానికి అంగీకరిస్తూ మద్రాసు రాష్ట్రప్రభుత్వం కేంద్రానికి వ్రాసిన విషయం పాఠకులకు తెలిసినదే. కర్నూలులో ఆంధ్ర రాజధాని నెలకొల్ప బడటం వల్ల, కర్నూలు వద్ద తుంగభద్రానదికి రోడ్-బ్రిడ్జి నిర్మించితే అది బలంగా వుండటానికి వీలుగా సిద్ధేశ్వరం డాము ఎత్తు తగ్గించాలని ఇంజనీరు సిఫార్సు చేసినందువల్ల రోడ్ బ్రిడ్జి సమస్యను పునః పరిశీలనకు తీసుకురావాలని ఆంధ్ర ప్రభుత్వం నిర్ణయించింది.





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras